## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహ్ ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంథాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంథాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంథాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంథాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంథాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

Dwarkadheesh Vastu

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

### Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక



☆ ☆ ☆

ఎందుకంటే – నేను నీ కన్నా దుఃఖితుడైన, మంద భాగ్యుడైన రాజును గురించి ఎరుగుదును. ఆ వృత్తాంతము నాకు బాగా తెలియును. నీకాసక్తి ఉంటే ఆ వృత్తాంతమును వినిపించెదను." అన్నాడు. తప్పక వినిపించండి అని ధర్మరాజు కోరెను.

అప్పుడు మహర్షి బృహదశ్వుడు ఈ విధంగా చెప్పసాగాడు.

## దమయంతీ స్వయంవరం - వివాహం

ధర్మరాజా! నిషధ దేశంలో వీరసేనుని కొడుకు నలుడనే ఒక రాజుండేవాడు. ఆయన మంచి గుణవంతుడు, పరమసుందరుడు, సత్య వాది, ఇంద్రియాల్ని గెలిచినవాడు, సర్వప్రియుడు, వేదజ్ఞానసంపన్నుడు, అదే విధంగా బ్రాహ్మణ భక్తుడు. బలమైన గొప్ప సైన్యమున్న వాడు. సైనికులందరూ యుద్ధ విద్యలలో సర్వసమర్థులు. ఆయన చెప్పుకోదగ్గ వీరుడు, యుద్ధనిపుణుడు, ఉదారుడు ఎంతో పరాక్రమమున్నవాడు. కాని ద్యూతవ్యసనము గలవాడు. నలమహారాజున్న కాలంలోనే భీముడనే పేరుగల రాజు విదర్భరాజ్యాన్ని పాలించేవాడు. ఆయన కూడా నలునితో సమానమైనవాడే తప్ప తక్కువవాడు కాడు, నలుడంత సర్వగుణసంపన్నుడూ పరాక్రమశాలి అని పేరున్నవాడు. ఆయన దమన ఋషిని ప్రసన్నం చేసుకుని ఆయన ఇచ్చిన వరము కారణంగా నలుగురు సంతానాన్ని పొందాడు. అందులో ముగ్గురు మగపిల్లలు. ఒక అమ్మాయి. దముడు, దాంతుడు, దమనుడు అనేవి ఆ ముగ్గురు మగపిల్లల పేర్లు. కాగా అమ్మాయి పేరు దమయంతి. దమయంతి సామాన్యురాలు కాదు. సాక్షాత్తు లక్ష్మీదేవితో సమానురాలైన రూపవతి. ఆమె విశాల నేత్రములను గలిగి, దేవతల్లోనూ యక్షుల్లోనూ కూడా అంత అందమైనవారు లేరన్నట్లుండేది. అందువల్లనే ఆకాలంలో విదర్భదేశం నుండి నిషధదేశం వచ్చిన వారంతా నలుని ముందు దమయంతి అందచందాలను, గుణ గణాలను పూసగుచ్చినట్లు చెప్పేవారు. అదే విధంగా నిషధదేశం నుండి విదర్భదేశానికి వెళ్ళిన వారు దమయంతి ముందు నలమహారాజుయొక్క అందచందాలను గుణగణాలను అలాగే వివరించేవారు. ఆయన పవిత్ర చరిత్రను కూడా దమయంతికి

తెలియ జెప్పేవారు. నలదమయంతుల మధ్య పరస్పర అనురాగాలు అంకురించాయి.

ఒకరోజు నలమహారాజు తన భవనములోని ఉద్యాన వనంలో కొన్ని హంసలను చూచాడు. అందులో ఒక హంసను పట్టుకోగా ఆ హంస ఇలా చెప్పసాగింది. "మీరు నన్ను వదిలేస్తే మేమంతా దమయంతి చెంతకు వెళ్ళి మీ గుణగణాలను వర్ణించి మరీ చెప్తాం. ఆ చెప్పడంలోనూ - మిమ్మల్ని ఆమె తప్పక వరించే విధంగా చెప్పగలం"



అది విని నలుడు హంసను వదిలేశాడు. ఆ హంసలన్నీ రివ్వున ఎగిరి విదర్భ దేశానికి వెళ్ళాయి. అంతే దమయంతి చెంత ప్రత్యక్షమయ్యాయి. దమయంతి ఆ హంసల్ని చూచీ చూడగానే ఎంతో ప్రసన్నురాలైంది. వాటిని పట్టుకోవడానికి పరిగెత్తుతూ వెళ్ళింది. దమయంతి ఏ హంసనైతే పట్టుకోడానికి వెళ్ళిందో, ఆ హంస "ఓ దమయంతీ! నిషధ దేశంలో నలుడనే రాజున్నాడు. ఆయన అశ్వినీకుమారుడంతటి అందగాడు.



మానవులలో అతనివంటి అందచందాలు గలవాడు మరొక్కడు లేడు. ఆయన మూర్తీభవించిన మన్మథుడు. నీవే కనక అంతటి గొప్ప వ్యక్తికి భార్యవైతే నీ జన్మ, నీ సౌందర్యం సార్థకములవుతాయి. దేవతలను, గంధర్వులను, మనుష్యులను, నాగజాతివారిని, రాక్షసులను మేమెందరినో తిరిగి తిరిగి చూచాము. కాని, నలునితో సమానుడైన అందగాడిని మాత్రం ఎక్కడా చూడలేదు.

నీవు స్త్రీలలో రత్నానివి; అతడు పురుషులలో భూషణము వంటివాడు. మీ ఇద్దరి 'జంట' అపూర్వమైనది."

అప్పుడు దమయంతి "హంసా! ఇవేమాటలు నీవు నలునితో కూడా చెప్పాలి. సుమా" అంది. ఆ హంస నిషధ దేశానికి తిరిగి వెళ్ళి దమయంతీ సందేశాన్ని నలునికి తెలిపింది.

హంసనోట నలమహారాజు కీర్తి ప్రఖ్యాతులు విన్న దమయంతి ఆయనను గాఢంగా ప్రేమించసాగింది. ఇక రాత్రీ పగలూ ఆమెకు నలమహారాజు ధ్యాస వినా మరొకటి లేదు. నలునిపై రక్తి, ఆసక్తి కూడా పెరిగిపోయినవి. నలుని మననధ్యానాదులలో ఆమె శరీరం శుష్కించి పోతోంది. ఇప్పుడామె నలుని ప్రేమకు వివశురాలైనది.

దమయంతి చెలికత్తెలు ఆమె మనోభావాలు గ్రహించినవారై విదర్భమహారాజుతో "మీ కుమార్తె అస్వస్థురాలైనది" అని తెలిపారు భీమరాజు తన పుత్రిక గురించి ఛాలా విచారించాడు చివరకు "నా పుత్రిక వివాహయోగ్యురాలైవుంది. ఇందువలన స్వయంవరం ఏర్పాటు చేయాలని" నిర్ణయించుకున్నాడు. స్వయంవర - ఆహ్వాన పత్రికలు రాజులందరికీ పంపాడు. స్వయంవరంలో 'మా అమ్మాయిని పొంది నా వాంఛితాన్ని సఫలం చేయండి' అని ఆ పత్రికల్లో పేర్కొన్నాడు.

దేశదేశాల రాజులు ఏనుగులపై, గుఱ్ఱాలపై రథాలపై మనోరథ సాఫల్యాలను వాంఛిస్తూ భూదేవి అదిరిపోయేలా విదర్భకు విచ్చేసారు. భీమ మహారాజు స్వాగత సత్కారాలతో వారిని ఆదరించాడు.

దేవర్షి నారద, పర్వతుల ద్వారా దమయంతీ స్వయంవర సమాచారం దేవతలకు సైతం తెలిసింది. ఇంద్రాదులైన లోకపాలురు సపరివారంగా

వాహన సమేతంగా విదర్భ దేశానికి పయనమయ్యారు. ముందునుండీ దమయంతిపై ఆసక్తి, అనురాగాలు కల నలుడు కూడా విదర్భకు స్వయంవర ఫలగామియై వెళ్ళాడు. దేవతలు స్వర్గలోకం నుండి భూలోకానికి దిగేసమయంలో మన్మథుని వలె విలసిల్లుచున్న నలుడు దమయంతీ స్వయంవరానికి వెడుతుండడం చూచారు. లోకోత్తరమైన రూపంతో సూర్యకాంతి వలె ధగధగలతో మెరిసిపోయేనలుని సౌందర్యసంపదకు ఆ దేవతలు ఆశ్చర్య చకితులయ్యారు. ఇంద్రాదులు తమ విమానాలను ఆకాశంలోనే ఆపి, క్రిందకు దిగి, నలునితో అన్నారు గదా! "నలరాజేంద్రా! మీరు గొప్ప సత్యవ్రతులు. మీరు మాకు సహాయపడే దూతగా ఉండండి".

పెద్దల యెడ భక్తి ప్రపత్తులుగల నలమహారాజు 'సరే నేను దూతగా అవుతానని, ప్రతిజ్ఞ చేస్తున్నాను' అంటూ 'మీరెవ్వరు? నేను మీకు దూతగా అయి ఏమి పనిచేయవలసి వుంది?' అని వారిని ప్రశ్నించాడు. అప్పుడు ఇంద్రుడు "మేము దేవతలము, నేను ఇంద్రుణ్ణి. వీరు అగ్ని, యమవరుణులు మేము దమయంతి కొరకు వెడుతూ ఇక్కడకు వచ్చాము. మీరు మా దూతగా దమయంతి వద్దకు వెళ్ళండి. ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు అనే దేవతలు నిన్ను వివాహమాడగోరి వచ్చారు. వారిలో నీకు నచ్చిన ఒకరిని పతిగా స్వీకరించాలి అని మీరు దమయంతికి చెప్పాలి" అన్నాడు.

నల మహారాజు రెండు చేతులు జోడించి, 'దేవరాజా! స్వయంవరానికి వెళ్ళడంలో మీ ఉద్దేశమూ, నా ఉద్దేశమూ ఒకటే. అందువలన మీరు నన్ను దూతగా దమయంతి వద్దకు పంపడం భావ్యంగాలేదు. నేను ఏ స్త్రీనైతే భార్యగా పొందాలని అభిలషిస్తున్నానో ఆమెవద్దకు వెళ్ళి, నా ఇచ్ఛను వీడి, మీరు చెప్పిన మాటలు చెప్పడం ఏ విధంగా కుదురుతుంది? మీరంతా ఈ విషయంలో నన్ను దయచేసి క్షమించండి,'* అని వేడుకున్నాడు.

* కథం తు జాతసంకల్పః స్త్రియముత్సృజతే పుమాన్।
పరార్థమీదృశం వక్తుం తత్ క్షమన్తు మహేశ్వరాః॥

దేవతలు 'నలుడా! ముందు నీవు మా పని నిర్వహిస్తానని ప్రతిజ్ఞచేశావు. నీవు చేసిన ప్రతిజ్ఞను వీడకు. ఆలస్యంచేయకుండా మాపనికి నడుము కట్టు' మన్నారు.

నలుడన్నాడుగదా 'రాజమందిరంలో నిరంతరం గట్టికాపలా ఉంటుంది. పహరా తిరుగుతూంటారు. అటువంటి రాజమందిరంలోనికి నేనే విధంగా వెళ్ళగలుగుతాను?' అన్నాడు. "వెళ్ళగలుగుతావు" అన్నాడింద్రుడు. ఇంద్రుని ఆజ్ఞపై నలుడు రాజమందిరంలోనికి నిర్విఘ్నంగా ప్రవేశించాడు. దమయంతిని చూచాడు. దమయంతి, ఆమె చెలికత్తెలు ఆయనను చూచి అవాక్కయిపోయారు. ఆ అనుపమ సుందరుని చూచి వారు ముగ్ధులయ్యారు. ముగ్ధులై సిగ్గుతో ఏమీ మాట్లాడలేక పోయారు.

తననుతాను సంబాళించుకుని దమయంతి నలరాజుతో "వీరుడా! నిన్ను చూస్తే చాలా అందగాడవుగాను, నిర్దోషివిగాను ఉన్నావు. ముందు నీ పరిచయం అభిలషిస్తున్నాను. నీవు ఏ ఉద్దేశ్యంతో ఇక్కడికి వచ్చావు? అసలు ద్వారపాలకుడు చూడకుండా ఏ విధంగా రాగలిగావు?" అన్నది.

నలుడు చెప్పసాగాడు "కళ్యాణీ! నేను నలుణ్ణి. దిక్పాలుర దూతగా నేనిక్కడికి వచ్చాను. సుందరీ! ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు నలుగురు నిన్ను వివాహం చేసుకోవాలని కోరుకుంటున్నారు. నీ వా నలుగురిలో ఒకరిని పతిగా వరించాలి. నేను ఈ సందేశాన్ని గైకొని నీ వద్దకు రావడం జరిగింది. ఎవ్వరూ చూడకుండా నీ మందిరంలోనికి ఎలా రాగలిగానన్నదికదా నీ సందేహం? ఆ దేవతల మహిమవల్లనే ఎవరికంట బడకుండా నీ మందిరంలోకి ప్రవేశించగలిగాను. ఆ దేవతల సందేశాన్ని నీకు అందజేశాను. ఇప్పుడు నీకు ఏది అభీష్టమో దానిని చేయవలసింది."

అప్పుడు దమయంతి బహుశ్రద్ధతో దేవతలకు నమస్కరించుకొని చిరునవ్వుతో 'నరేంద్రా! మీరు నన్ను ప్రేమదృష్టితో చూడండి. మీకు నేను ఏవిధంగా సేవచేయాలో ఆజ్ఞాపించండి. నా స్వామీ!

మిమ్ముల్నిగురించి హంసద్వారా ఎప్పుడైతే విన్నానో అప్పటినుండి నేను మీ గురించే వ్యాకుల పడుతున్నాను. నేను మీ పాదాలచెంత నా సర్వస్వాన్ని అర్పించుకోదలచాను. నన్ను సంపూర్ణ విశ్వాసంతో ప్రేమించండి. నేను మీ గురించే రాజులందర్నీ విచ్చేయజేస్తున్నాను. మీరు కనుక మీదాసిగా నన్ను స్వీకరించని యెడల నేను విషం త్రాగో, అగ్నిలో పడో, నీళ్ళలో దూకో, ఉరిపోసుకునో ఏదోవిధంగా ప్రాణత్యాగం చేస్తాను' అని తన హృదయగతాన్ని స్పష్టం చేసింది. నలుడు "నిన్ను గొప్పగొప్ప దేవతలే కోరుకుంటున్నప్పుడు మనుష్యుణ్ణి నన్ను కోరుకుంటున్నావేమి? ఐశ్వర్యవంతులగు ఆ దేవతల చరణరేణువుతో కూడా సరిపోలని వాడను. నీవు నీ మనస్సును వారిపైన లగ్నం చేసుకో. దేవతలకు అప్రియం చేసే మనుష్యులకు మృత్యువు వాటిల్లుతుంది. నీవు నన్ను రక్షించు, వారిలో ఒక్కరిని వరించు" అన్నాడు.

నలుని మాటలు విన్న దమయంతి చాలా ఆందోళన చెందినది. ఆమె రెండు కళ్ళూ అశ్రువులతో నిండి పోయాయి. ఆమె చెప్ప సాగింది. "నేను దేవతలందరకు నమస్కరిస్తూ నిన్నే పతిగా వరించుచున్నాను. ఇలాగని నేను సత్యశపథం చేస్తున్నాను."* ఈ విధంగా అంటున్నప్పుడు దమయంతి శరీరం కంపించసాగెను. చేతులు జోడించి యుండెను.

నలమహారాజు చెప్పాడు 'మంచిది నీ వలాగే చేయుము. నేను నీ కొకటి చెప్పాలి అదేమిటంటే – వారిదూతగా వచ్చినప్పుడు నేను వారిగురించి చెప్పడమే ధర్మం. తన స్వార్థం చూసుకోవడం దూత ధర్మం కానేరదు. ధర్మ విరుద్ధముకానప్పుడే నా స్వార్థము నెరవేరగలుగును. నీవు కూడా అటులే చేయువలెను.'

దమయంతి గద్గదస్వరంతో! 'నరేశ్వరా! ఈ సందర్భంలో ఒక ధర్మోపాయం ఉంది. అది నిర్దోషమైనది. దీనిని అనుసరించి చేస్తే నీకు ఏ దోషమూ అంటుకోదు. నీవు దిక్పాలురతో సహా

---

* దేవేభ్యోఽహం నమస్కృత్య సర్వేభ్యః పృథివీపతే!
వృణే త్వామేవ భర్తారం సత్యమేతద్ బ్రవీమి తే॥ (మహా.భార.వన. 56/14)

స్వయంవరమంటపానికి వస్తే నేను వారి సమక్షంలోనే నిన్ను వరిస్తాను. ఇందువల్ల దోషం ఆవగింజంతకూడా ఉండదు' అని వివరించింది.

అప్పుడు నలుడు దేవతల వద్దకు వెళ్ళాడు. వాళ్ళడుగగా ఇలా చెప్పాడు. "నేను మీ ఆజ్ఞగైకొని దమయంతీ మందిరానికి వెళ్ళాను. బయట ముసలి ద్వారపాలకులుండిరి. మీమీ ప్రభావ కారణంగా వారెవ్వరూ నన్ను చూడనేలేదు. కేవలం దమయంతి, ఆమె పరిచారికలు మాత్రమే నన్ను చూడటం తటస్థించింది. నన్ను చూచి వారాశ్చర్యంలో మునిగి పోయారు. నేను మాత్రం దమయంతీ సన్నిధానంలో మీమీ గుణగణాలను వర్ణించాను. కానీ ఆమె మిమ్మల్ని ఎవ్వరినీ ఇష్టపడకుండా, నన్ను వరించడానికే నిశ్చయించుకొంది. దేవత లందరూ స్వయంవరానికి విచ్చేయుదురుగాక, వారి సమక్షంలోనే నిన్ను వరిస్తానని ఇందులో మీకు దోషం ఉండబోదని నాతో చెప్పింది.

నేను మీతో సంగతులన్నీ దాచకుండా చెప్పేశాను. చివరి సాక్ష్యము మీరే"* అని పూసగ్రుచ్చినట్లు చెప్పడం జరిగింది.

భీమరాజు శుభముహూర్తంలో స్వయంవర సమయాన్ని నిర్దేశించాడు. అందరిని పిలవడానికి తన మనుష్యులను పంపించాడు. రాజులందఱును తమతమ నివాసాలనుండి వచ్చి తమతమ స్థానాల్లో కూర్చున్నారు. సభయావత్తూ వచ్చిన రాజులతో నిండిపోయింది. దమయంతి తన శరీరసౌందర్యకాంతులతో రాజుల హృదయాలను, కళ్ళను తనవైపు ఆకర్షితులను చేసుకుంటూ వేదిక వద్దకు వచ్చింది. రాజుల పరిచయాలు చేయబడసాగాయి. దమయంతి ఒక్కొక్క రాజునే చూచుకుంటూ ముందుకు వెళ్ళసాగింది. కాని ఒక స్థానం దగ్గరకు వెళ్ళి, ఆశ్చర్యంతో ఆగి చూచింది, చిత్రం! నలుని రూపాల్లో నలుని లాగే వేష భూషణాలతో అయిదుగురు రాజులు కూర్చోవడం చూచింది. నలుడెవ్వరో తెలియరాలేదు. ఆ అయిదుగురిలో ప్రతి ఒక్కరూ

---

* తేషామహం సన్నిధౌ త్వాం వరయిష్యామి నైషధ!
ఏవం తవ మహాబాహో! దోషో న భవితేతి హ! (మహా.వనపర్వం 56–30)

అచ్చంగా నలుడే అనుకొనే విధంగా ఉన్నారు. అందులో అసలు నలుడెవ్వరో తెలుసుకోవడం గగనమైపోయింది. దమయంతి చాలా దుఃఖించింది. చివరకు దేవతలను శరణుకోరి, సత్యాన్ని గ్రహించాలని నిశ్చయించింది. రెండు చేతులనూ జోడించి దేవతలను ప్రస్తుతించ సాగింది.

"దేవతలారా! నేను హంస ముఖతః నలుని అందచందాల వర్ణన విని, ఆయనను నేను పతి రూపంగా వరించాను. నేను మనస్సుతో వాక్కుతో నలుని మాత్రమే కోరుకుంటున్నాను. ఆయన తప్ప మరొకరిని కోరుకోవడం లేదు. నిషధేశ్వరుడగు నలుడినే నాకు పతిగా దేవతలు ప్రసాదించారు. కావున ఓ దేవతలారా! నలుని ఆరాధనే నావ్రతం ఈ నా సత్యశపథం బలం వల్ల మీలో ఎవ్వరు అసలు నలుడో తెలుసుకునే విధంగా అనుగ్రహించండి, ఆయనను చూపించండి.*

ఐశ్వర్యశాలురైన ఓ దిక్పాలకులారా! మీరూపాలు మీరు దృగ్గోచరం చేయండి. అందువల్ల పుణ్యశ్లోకుడగు నలుని గ్రహించ గలిగెదను."

దమయంతి ఆర్తిని, విలాపమును దేవతలు విన్నారు. ఆమె దృఢ నిశ్చయం, నిజమైన ప్రేమ, ఆత్మశుద్ధి, బుద్ధి, భక్తి నలుని యందాసక్తి – వీటన్నిటిని చూచి ఆ దేవతలు దమయంతికి దేవతల, మనుష్యుల మధ్య తేడా గ్రహించ గలిగెడు శక్తిని ప్రసాదించారు.

దమయంతి చాతుర్యం కలది. ఆమె దేవతల శరీరంపై చెమట లేకపోవడం, వారి కనురెప్పలు క్రిందకు పడక పోవడం, మెడలోని

---

* వాచా చ మనసా చైవ నమస్కారం ప్రయుజ్య సా
దేవేభ్యః ప్రాంజలిర్భూత్వా వేపమానేదమబ్రవీత్
హంసానాం వచనం శ్రుత్వా యథా మే నైషధో వృతః
పతిత్వే తేన సత్యేన దేవాస్తం ప్రదిశన్తు మే
మనసా వచసా చైవ యథా నాభిచరామ్యహమ్
తేన సత్యేన విబుధాస్తమేవ ప్రదిశన్తు మే. (మహా–వన–58–16 నుండి 18)

పూలమాల వాడక పోవడం వంటివి గమనించింది. చెమట పట్టక పోవడం, కనురెప్పలు పడకపోవడం అనేవి దేవతల లక్షణాలు. దేవతలు సింహాసనాలపై కూర్చున్నారే కాని వారి పాదాలు నేలను తాకడం లేదు వారి నీడ పడడం లేదు.*



* సాపశ్యద్ విబుధాన్ సర్వానస్వేదాన్ స్తబ్ధలోచనాన్
హృషితస్రగ్రజోహీనాన్ స్థితానస్పృశతః క్షితిమ్. (మహా.వన.57-24)

నలుని శరీరంనీడ పడుతోంది. దండ వాడి పోయింది. నలునిశరీరం కొంచెం కొంచెం దుమ్ము, చెమటబిందువులు పట్టివున్నాయి. అతడు కనురెప్పలు వేయడం గమనించబడింది. అంతేకాక ఆయన నేలను తాకుతూ కూర్చున్నాడు. ఈ గుణాలవల్ల దేవతలను, నలుని ఎవరెవ్వరో దమయంతి చక్కగా గ్రహించింది. ధర్మానుగుణంగా నలుని వరించింది.



దమయంతి కొంచెం సిగ్గు పడుతూ ముసుగుతీసేసి వరమాల నలుని కంఠంలో అలంకరించింది. దేవతలు, మహర్షులు బాగుబాగు అన్నారు. రాజులలో హాహాకారం వ్యాపించింది.

నలమహారాజు ఆనందాతిశయంతో దమయంతిని అభినందించాడు.

నలుడు "కల్యాణీ! నీ ఎదుట దేవతలు ఉన్నప్పటికీ నన్నే వరించావు. ఇందువలన నీవు నన్ను ప్రేమాతిశయంగల పతిగా భావించాలి. నేను నీ మాట వింటాను. నా శరీరంలో ప్రాణ ముండునంత వరకూ నేను నిన్ను ప్రేమిస్తుంటాను. ఈ మాటలు నేనుశపథం చేసి చెబుతున్నాను, వినుము. నలదమయంతు లిద్దఱూ ఒకరినొకరు అభినందించుకున్నాక ఇంద్రాది దేవతల శరణు గైకొన్నారు. దేవతలు చాలా ప్రసన్నులయ్యారు. నలునికి ఎనిమిది వరాలను ప్రసాదించినారు."

ఇంద్రుడన్నాడు 'నలుడా! నీకు యజ్ఞంలో నా దర్శనమవుతుంది. నీకు ఉత్తమ గతులు లభ్యమౌతాయి.'

అగ్ని అన్నాడు కదా! "నలుడా ఎప్పుడు నీవు నా స్మరణ చేస్తే అప్పుడు నీకు దర్శన మిస్తాను నీవు నావలె ప్రకాశించే లోకాలన్ని పొందగలవు."

యమధర్మరాజు – "నీవు చేసే వంటకాలు మధురంగా ఉంటాయి. ధర్మవిషయంలో నీవు దృఢంగా ఉండగలవు" అన్నాడు.

వరుణుడు "నలుడా! నీవు ఎక్కడ అభిలషిస్తే అక్కడ జలాలు పైకి వస్తాయి. అంతేగాక నీ హారము మంచి పరిమళాలతో నిండి ఉంటుంది" అని అన్నాడు.

ఈవిధంగా దిక్పాలకులైన దేవతలు నలునికి రెండేసి వరాలను ప్రసాదించి వారి వారి లోకాలకు వెళ్ళిపోయారు తక్కిన రాజులుకూడా వారి వారి స్థానాలకు వెళ్ళిపోయారు.

భీమరాజు ఎంతో ప్రసన్నుడై నలునికి దమయంతినిచ్చి శాస్త్రోక్తంగా వివాహం చేశాడు. నలమహారాజు కొన్నాళ్ళవరకు విదర్భ రాజధాని కుండినపురంలో ఉన్నాడు. తదనంతరం భీమరాజు అనుమతి స్వీకరించి తన భార్య దమయంతిని తీసుకొని తన రాజధానికి వెళ్ళిపోయాడు.

నలరాజు తన రాజధానిలో ఉంటూ ధర్మానుగుణంగా రాజ్యపాలన చేయసాగాడు. నిజంగా అతని ద్వారా 'రాజు' శబ్దము సార్థకమై పోయినది. ఆయన అశ్వమేధం మొదలైన అనేక యజ్ఞాలను నిర్వహించాడు.

కొంతకాలం పిదప దమయంతి గర్భరత్నాలుగా 'ఇంద్రసేను'డనే పేరుగల పుత్రుడు, 'ఇంద్రసేన' అనే పుత్రిక జన్మించారు.

★ ★ ★

శ్రీ హరిః

# కలియుగ దుష్ప్రభావం

## జూదంలో నలుడు ఓడిపోవుట - నగర నిష్క్రమణ

బృహదశ్వమహర్షి చెబుతున్నాడు 'యుధిష్ఠిరుడా! దమయంతి స్వయంవరం నుండి దిక్పాలురు తిరిగి తమ తమ లోకాలకు వెళ్లేటప్పుడు కలియుగ ద్వాపరయుగ పురుషులతో చర్చజరిగింది. ఇంద్రు డడిగాడు 'కలిపురుషా! ఏమిటి విశేషం! ఎక్కడికి వెడుతున్నావు? కలి ప్రత్యుత్తరం 'నేను దమయంతీ స్వయం వరానికై ఆమెను వివాహమాడాలనే అభిలాషతో వెడుతున్నాను.'

అప్పుడింద్రుడు చిరునవ్వు నవ్వి "భలేగా ఉంది. ఆ స్వయంవరం ఎప్పుడో జరిగిపోయింది. దమయంతి నలుని వరించింది. మేమంతా వెళ్ళి వచ్చాం. కలియుగ పురుషుడు కోపంతో "ఓహో! అయితే చాలా అనర్థమయిందే. ఆమె దేవతలను ఉపేక్షించి మనుష్యుని పొందినదా! అందువలన ఆమెను శిక్షించవలసి వుంది" అన్నాడు. అప్పుడు దేవతలు "అది సరికాదు, దమయంతి మా ఆజ్ఞను స్వీకరించే నలుని వరించింది. నిజానికి నలుడు సర్వగుణసంపన్నుడు, ఆమెకు తగినవాడు. సర్వధర్మ మర్మజ్ఞుడు. సదాచార సంపన్నుడు. అతడు ఇతిహాస పురాణ సహితంగా వేదాధ్యయనం చేసినవాడు. ధర్మానుసారంగా యజ్ఞాలతో దేవతలను సంతృప్తులను చేయువాడు. ఆయన ఎవరినీ బాధించడం లేదు. దృఢనిశ్చయం కలిగినవాడు. సత్యనిష్ఠ కలిగినవాడు, చతురత, ధైర్యం, జ్ఞానం, తపస్సు, పవిత్రత, దమ, శమ గుణాలలో లోకపాలకులతో సమానమైనవాడు. ఆయనను

శపించడమంటే నరకలోక జ్వాలాగ్నిలో పడి పోవడమే" ఈ విధంగా చెప్పి ఆ దేవతలు వెళ్ళిపోయారు.*

అప్పుడు కలియుగపురుషుడు ద్వాపరునితో 'సోదరా! నేను కోపాన్ని శాంతింపజేయను. ఇందుచేత నేను నలుని శరీరంలో నివసిస్తాను. నేను ఆయనను రాజ్య భ్రష్టునిగా చేస్తాను. అప్పుడతను దమయంతితో నివసించలేడు. ఇందు కనుగుణంగా నీవు కూడా జూదంలో పాచికల్లో ప్రవేశించి నాకు సహాయం చేయాలి.' అనగా ద్వాపరుడు కలి మాటలను స్వీకరించాడు.

కలి ద్వాపరులిద్దరూ నలుని రాజధానీ నగరానికి వచ్చి వున్నారు. నలునిలో ఏదో ఒక దోషం కనిపెట్టాలనుకున్న వారిద్దరూ 12 సంవత్సరాల వరకూ ఏదోషమూ నలమహారాజువద్ద చూడలేకపోయారు.** ఒకరోజు నలరాజు సంధ్యాసమయంలో లఘుశంకకు వెళ్ళవలసివచ్చి, వెళ్ళి వచ్చాక కాళ్ళు కడుగకుండానే ఆచమనముచేసి, అలాగే సంధ్యావందన కార్యక్రమాలు నిర్వర్తించడానికి కూర్చుండిపోయాడు. ఈ అపవిత్రతను గమనించినవాడై కలి నలుని శరీరంలో ప్రవేశించాడు. అలా నలశరీరంలో ప్రవేశించినదే తడవుగా కలి రెండవ రూపాన్ని ధరించినవాడై పుష్కరుని వద్దకు వెళ్ళి చెప్పాడు.

"నీవు నలునితో ద్యూత మాడుము. నా సహాయంతో నీవు నలుని ఓడిస్తావు. ఆ విధంగా నిషధదేశ రాజ్యాన్ని హస్తగతం చేసుకో."

---

* ఏవం గుణం నలంయో వై కామయేచ్ఛపితుం కళే
కృచ్ఛ్రే స నరకే మజ్జేదగాధే విపులే హ్రదే
ఏవ ముక్త్వాకలిందేవా ద్వాపరం చ దివం యయుః (మహా.వన.58-12)

** స నిత్యమంతరప్రేప్సుర్నిషధేష్వవసచ్చిరమ్
అథాస్యద్వాదశేవర్షే దదర్శ కలిరన్తరమ్
కృత్వా మూత్రముపస్పృశ్య సంధ్యామన్వాస్త నైషధః
అకృత్వా పాదయోః శౌచం తత్రైనం కలిరావిశత్. (మహా.వన 59-2,3)

పుష్కరుడు కలి మాటలు విని నలుని వద్దకు వెళ్ళాడు. ద్వాపరుడు పాచికల రూపం ధరించి పుష్కరునితో వెళ్ళాడు. పుష్కరుడు బలవంతపెట్టగా నలుడు పాచికలాడుటకు అంగీకరించెను.

పుష్కరుడు నలునితో ద్యూతమాడడం ప్రారంభించాడు. కలి తన శరీరంలో ప్రవేశించి వున్నందువలన నలునికి అంతా దుష్టఫలితమే ఎదురుకాజొచ్చింది. నిత్యనైమిత్తిక కార్యక్రమాలకు విఘాతం ఏర్పడింది. పాలనాకార్యక్రమాలకూ విఘాతం ఏర్పడింది.

పుష్కరుని పాచికలు పారాయి. నలుడు పాచికల పందెములో బంగారం, వెండి, రథాలూ, వాహనాలూ అన్ని ఒడ్డి ఓడిపోయాడు. ప్రజలు, మంత్రులు నలుని ద్యూతఫలితాలకు బాధపడ్డారు. ఎలాగయినా ఆయన ద్యూతం మానేస్తే బాగుండునని భావించారు. ఆ సంగతి చెబుదామని వారు వచ్చి ద్వారం చెంతకు చేరుకున్నారు. వారి అభిప్రాయాన్ని గ్రహించి ద్వారపాలకులు దమయంతి చెంతకు వెళ్ళి "మీరు మహారాజుకు ఇటుల విన్నవించండి – మీరు నిజమైన ధర్మ, అర్థతత్త్వజ్ఞులు. మీ ప్రజలందరూ మీకు గలుగుతున్న దుఃఖాన్ని సహించలేకుండా వున్నారు. మీతో వచ్చి కలవడానికి ద్వారం వద్ద నిలచి ఉన్నారు. దమయంతి దుఃఖంతో నలమహారాజు వద్దకు వెళ్ళి గద్గద కంఠంతో "స్వామీ! నగరంలోని రాజభక్తులగు ప్రజలు, మంత్రిమండలిలోని వారు మిమ్మల్ని కలియుటకై వచ్చి బయటనున్నారు. వారిని మీరుకలవండి" అంది.

కానీ నలుడు కలి పురుషుడు తనను ఆవేశించి వున్నందున ఆ ప్రభావంలో మునిగిపోయివున్నందున ఆమెకు ఏమీ బదులు చెప్పలేదు. మంత్రిమండలివారు, ప్రజలు శోకసంతప్తులై అశక్తులై వెళ్ళిపోయారు.

పుష్కరుడూ నలుడూ కొన్ని నెలల పాటు ద్యూత మాడారు. నలుడు పూర్తిగా ఓడిపోయాడు. నలుడు వేసేపాచికలు ప్రతిసారి అతనికి వ్యతిరేకంగా పడసాగాయి. ధనమంతా చేజారి పోయింది. ఈ సంగతి తెలుసుకున్న దమయంతి నలుని సారథి వార్ష్ణేయుని పిలిపించింది. ఆ సారథితో ఇలా చెప్పసాగింది –

'సారథీ! నీవు మహారాజుకు ప్రేమపాత్రుడవు. మహారాజు చాలా కష్టాలలో చిక్కుకున్నారు అది నీతో దాచి పెట్టునదికాదు. అందుచేత నీవు రథానికి గుఱ్ఱాలను పూన్చి, నా ఇద్దరు పిల్లలను రథంపై కూర్చొన బెట్టుకుని కుండిన నగరానికి తీసుకువెళ్ళు. నీకు ఇష్టమైతే అక్కడే వుండు. లేదా గుఱ్ఱాలను రథాన్ని అక్కడ వదిలివేసి నీవెక్కడికైనా ఏ ప్రాంతానికైనా వెళ్ళు.'



దమయంతి కథనాన్ని అంతా సారథి విన్నవాడై, మంత్రులతో ఆలోచించి పిల్లలను కుండినపురానికి చేర్చాడు. రథమూ, గుర్రాలూ అక్కడే వదిలివేసి కాలినడక మీదనే అయోధ్యకు వెళ్ళిచేరాడు. అక్కడ ఋతుపర్ణ రాజువద్ద సారథిగా ఉండసాగాడు. సారథి వార్ష్ణేయుడు వెళ్ళిపోయాక పుష్కరుడు నలరాజును పాచికల ఆటలో ఓడించి రాజ్యాన్ని ధనాన్ని తీసేసుకున్నాడు. అప్పుడు పుష్కరుడు నలుని సంబోధిస్తూ నవ్వుతూ "ఏమిటి? ఇంకా ద్యూత మాడెదవా? అన్నాడు, ఆటలో ఒడ్డడానికి నీ దగ్గరేమీలేదు. కానీ పందెంలో దమయంతిని ఒడ్డడానికి నీకభ్యంతరం లేకపోతే అలా ఆడడం యోగ్యంగా నీవు భావిస్తే ఆడవచ్చు, అన్నాడు."

ఆ మాటలకు నలుని హృదయం పగిలినట్లయిపోయింది. ఆయన పుష్కరునితో బదులేమీ పలకలేదు. అప్పుడు తనపై ఉన్న ఆభరణాలన్నీ తీసివేసి ఒకే ఒక వస్త్రాన్ని కట్టుకుని నగరం నుండి నిష్క్రమించాడు. దమయంతి కూడా కట్టుచీరతో భర్తను అనుసరిస్తూ వెళ్ళింది. ఇలా వెళ్ళడం నలుని మిత్రులకు, సంబంధితులకు చాలా బాధను కలుగ జేసింది. నగరం బయట నలదమయంతులు మూడు రాత్రులవరకూ వున్నారు. పుష్కరుడు నగరంలో 'ఎవ్వరైనా నలుని పట్ల సానుభూతి ప్రకటిస్తే వారికి ఉరిశిక్ష విధించబడుతుందని' చాటింపు చేయించెను. భయంతో అట్టుడికి పోయిన ప్రజలు నలుని మంచి చెడ్డలు చూసే అవకాశమే లేకపోయింది. నలమహారాజు తననగరం బయట మూడవ రోజు రాత్రివరకూ కేవలం మంచినీళ్ళు మాత్రమే త్రాగి ఉండవలసి వచ్చింది. నాలుగవరోజున తీవ్రమైన ఆకలివేసింది. నలదమయంతులిద్దఱూ ఫలాలను తిని అక్కడ నుండి ముందుకు సాగారు.

ఒకరోజు తన వద్దకు ఎన్నో పక్షులు వచ్చి కూర్చొనడం చూశాడు. ఆ పక్షుల రెక్కలు బంగారంతో సమానంగా మెరుస్తున్నాయి. ఆ రెక్కలతో డబ్బేమన్నా సంపాదించవచ్చని నలుడు యోచించాడు. ఈ విధంగా ఆలోచించిన వాడై నలుడు తాను ధరించిన బట్టను ఆ

పక్షులను పట్టుకోవడానికి విసిరేశాడు. ఆ పక్షులు అతని వస్త్రాన్ని పట్టుకుని ఎగిరిపోయాయి. నలుడు దిగంబరుడై దీనత్వంతో ముఖాన్ని క్రిందకు దించి నిలబడి పోయాడు. అప్పుడు వెళ్ళిపోతున్న పక్షులు "దుర్బుద్ధికలవాడా! నగరంనుండి కట్టుకున్న వస్త్రంతో వచ్చేశావు. అది చూచి మాకు చాలా దుఃఖం కలిగింది. ఇప్పుడు మేము నీ ఒంటిపైనుండే బట్టను తీసుకుపోతున్నాం. మేము పక్షులము కాము,



ద్యూతంలోని పాచికలం, అని వెళ్ళిపోయాయి. నలుడు దమయంతితో పాచికల సంగతి చెప్పాడు. ఈ సంఘటన తరువాత నలుడు దమయంతితో 'ప్రియురాలా! నీవు చూస్తున్నావుకదా! ఇక్కడ చాలా మార్గాలున్నాయి. ఒక మార్గమేమో అవంతికి వెళ్లేది, రెండో మార్గం దక్షిణ దేశానికి వెళ్ళేదిగా ఉంది. ఎదురుగా అవిగో వింధ్యాచల పర్వతాలు. ఈ పయోష్ణీనది సముద్రంలో కలుస్తోంది. ఇవి మహర్షి ఆశ్రమాలు. ఎదురుగా ఉండే ఆ మార్గం విదర్భదేశానికి వెళ్ళేది. ఇదేమో కోసల దేశానికి వెళ్ళే మార్గం' అన్నాడు. దుఃఖమూ, శోకమూ పడుగుపేకలుగా అయిన నలుడు దమయంతికి భిన్న భిన్న మార్గాలు, ఆయా ప్రాంతాలు తెలుపుతూంటే నలుడు తనకు మాత్రమే ఏదైనా మార్గాన్ని ఆలోచిస్తున్నాడా అన్నట్లు వుంది. అప్పుడు దమయంతి నిండా కన్నీళ్ళతో గద్గదస్వరంతో 'స్వామీ మీరేమిటి ఆలోచిస్తున్నారు? నా అవయవాలు శిథిలమవుతున్నాయి. నా హృదయం ఉద్విగ్నమవుతోంది. మీరాజ్యం పోయింది. ధనం పోయింది. మీ శరీరంపై బట్టకూడా పోయింది. మీరు అలసి, సొలసి పోయి ఆకలితో దాహంతో ఉన్నారు. మీరు అవీ ఇవీ చెబుతున్నారు. అంటే మిమ్మల్ని నేను ఈ నిర్జన అరణ్యంలో వదిలి ఒంటరిగా ఎక్కడికి వెడతాను? ఎలా వెళ్ళగలను? నేను మీతోనే వుండి, మీ దుఃఖాన్ని దూరం చేయడానికి ప్రయత్నిస్తాను.

'దుఃఖ సమయాలలో భర్తకి భార్య ఔషధం వంటిది, ఆమె పతికి ధైర్యాన్ని ప్రోదిచేసి దుఃఖాన్ని తగ్గిస్తుంది. ఈ విషయాన్ని వైద్యులు కూడా అంగీకరిస్తున్నారు.' అన్నది.

అప్పుడునలుడు "ప్రియురాలా! నీవు చేప్పింది బాగానే ఉంది. భార్య స్నేహితురాలు, ఆమె ఔషధం కాదనడం లేదు. కాని నిన్నునేను వదిలి పెట్టి వెళ్లాలని అనుకోవడం లేదు. ఆ విధంగా నేను ఊహించుకోవడం లేదు, నీవు ఎందుకిలా సందేహిస్తున్నావు?" అన్నాడు. వెంటనే దమయంతి. "మీరు నన్ను వీడడానికి ఇష్టపడనంటున్నారు కదా మరి విదర్భదేశానికి మార్గం గురించి ఎందుకు చెబుతున్నారు? మీరు నన్ను

వదలరని నేను నిశ్చయంగానే చెప్పగలను. అయినప్పటికీ మీ మనస్సు కొంచెం ఏదో ఊగిసలాటలో ఉన్నట్లనిపించి మాత్రమే నాకు శంక కలిగింది. అంతకన్నా ఏంలేదు. మీరు అక్కడికీ, ఇక్కడికీ వెళ్ళే మార్గాలను చెప్పడంతో నాకు దుఃఖం కలిగింది. అంతే." అని వివరించింది. ఆ విధంగా అంటూ దమయంతి 'ఒకవేళ మీరు నన్ను నా తండ్రివద్దగాని బంధువుల వద్దగాని అట్టేపెడదామని భావిస్తే ఆ వుండడమేదో కష్టమో సుఖమో ఇద్దరము కలసే వుందాము. మా నాన్నగారింటికి రావడానికి మీరు అభిలషిస్తే మిమ్ములను సత్కారపూర్వకంగా ఆదరిస్తాడు. అక్కడ మీరు సుఖంగా ఉండవచ్చు' అని ఇంకా వివరంగా చెప్పింది.

నలుడు "ఓ ప్రియా! మీ తండ్రి రాజుగా ఉన్నాడు. నేనా! ఒకనాటి రాజును. కష్టాల కడగండ్లలో ఉండి నేను ఆయన వద్దకు వెళ్ళలేను." అంటూ దమయంతికి తన హృదయాన్ని విప్పి చెప్పాడు. తదనంతరం నలదమయంతులు ఇద్దరూ ఒకే వస్త్రాన్ని కప్పుకున్నవారై అరణ్యంలో ఇటూ అటూ తిరుగజొచ్చారు. ఆకలి దప్పులతో వారిద్దరూ వ్యాకులపడుతూ ఒక ధర్మశాలకు వచ్చి అక్కడ వున్నారు.

★ ★ ★

# నలుడు దమయంతిని వదిలి వెళ్ళుట

## కష్టాలలో ఋషుల దర్శన భాగ్యం
## సుబాహుని మందిరంలో నివాసం

బృహదశ్వుడు చెప్పసాగెను 'యుధిష్ఠిరుడా! ఆ సమయంలో నలరాజు శరీరంపై వస్త్రం లేదు, అంతే కాదు, నేలపై విశ్రాంతి తీసుకుందామంటే చాపకూడా లేదు. ఆయన శరీరం దుమ్ముపట్టి వుంది. ఆకలి, దాహం రెండూ విపరీతంగా బాధించు చుండెను. నల మహారాజు నేలమీదనే పడుకున్నాడు. దమయంతికి తన జీవిత కాలంలో అటువంటి పరిస్థితి ఎన్నడూ ఎదురయి వుండలేదు. పరమ సుకుమారి అయిన ఆమెకూడా నిద్రపోయింది. 'దమయంతి నిదురించిన తరువాత నలుడి నిద్ర భంగమయింది. ఇలా అనడం కంటే శోకవ్యాకుల కారణంగా ఆయనకు సుఖనిద్ర రావడమేలేదు అనేది నిజం. నలుడు కళ్ళు తెరచేటప్పటికి ఆయన కళ్ళెదుట అనేక దృశ్యాలు కనబడుతున్నాయి. రాజ్యం పోవడం, బంధువులకు దూరం కావడం, పక్షులు రావడం వస్త్రాన్ని తీసుకొని పోవడం – ఇవన్నీ ఒకటి తరువాత ఒకటిగుర్తుకు రాసాగాయి. ఇంతలో దమయంతి గురించి ఆలోచించ సాగాడు. – "నేనంటే దమయంతికి ఎంతో ప్రేమ. ఆ ప్రేమకారణంగానే కదా ఆమె ఇంతటి దుఃఖాన్ని అనుభవించవలసి వస్తోంది. నాతో ఉంటే ఈ దుఃఖాలు మాత్రమే అనుభవించ వలసి వస్తుంది. ఈమెను నేను ఇక్కడ వదిలి వెడితే, తన తండ్రిగారి యింటికి వెడుతుంది. నేను వెళ్ళిన పిదప ఈమెకు సుఖము లభించునుగాక!" – ఈ విధంగా అనుకొని తర్జనభర్జన పడి ఆమెను వదిలి వెళ్ళడమే ఆమెకు మేలు చేసినట్లవుతుందని నిశ్చయించుకున్నాడు.' దమయంతి నిజమైన

పతివ్రత గనుక ఈమె శీలాన్ని ఎవరూ భంగపరచలేరు అని కూడా అనుకున్నాడు నలుడు.*

నలుడు దమయంతిని వీడడానికి నిశ్చయించుకొని, ఆమె సతీత్వం భంగపడే అవకాశం వుండదని భావించినవాడై, తదుపరి ఈ విధంగా ఆలోచించాడు. "నేను నగ్నంగా ఉన్నాను. దమయంతి శరీరంపై ఒకే ఒక వస్త్రం వుంది. అయినప్పటికీ ఆ వస్త్రంలో సగభాగం తీసుకోవడం శ్రేయస్కరం. అయితే సగభాగం వస్త్రం చించి తీసుకోవడం ఎలా? ఈమె నిద్ర నుండి లేస్తే లేవవచ్చు కదా! అని ధర్మశాలలో అతడు అటూ యిటూ తిరుగాడసాగెను. నలుని దృష్టి ఒక కత్తిపై పడింది. ఆ కత్తి తీసుకుని దమయంతి యొక్క వస్త్రంలోని అర్ధభాగాన్ని చించి తన శరీరాన్ని కప్పుకున్నాడు. దమయంతి నిద్రలో ఉన్నది. ఆమెను వదలి నలుడు బయటపడ్డాడు. కొంత సేపటికి ఆయన హృదయం శాంతించింది. అప్పుడు మళ్ళీ ఆయన ధర్మశాలకు తిరిగి వచ్చి దమయంతిని చూచి రోదించసాగాడు. ఈ దమయంతి ఇంతవరకు అంతఃపురములో ఏలోటూ లేకుండా హాయిగా ఉండేది. కానీ ఇప్పటి పరిస్థితి ఏమిటి? అర్ధవస్త్రాన్ని ధరించి దుమ్ములో నిద్రిస్తూ ఉన్నది. నేను లేకుండా దుఃఖితయై అరణ్యంలో ఈమె ఎలా తిరుగుతుంది? ప్రియురాలా! నీవు ధర్మాత్మురాలవు. అందుచేత సూర్యుడు, వసువు, రుద్రుడు, అశ్వినీకుమారులు, మరియు వాయుదేవుడు నిన్ను రక్షించెదరు గాక!" ఈ విధంగా అనుకుంటున్నప్పుడు నలుని హృదయం దుఃఖభారంతో ముక్కచెక్కలయిపోతున్నట్లుగా ఉంది. ఆయన దమయంతిని వదలలేక వదలలేక ధర్మశాలనుండి బయటకు, బయట నుండి ధర్మశాలకు వెడుతూ వస్తూ ఉయ్యాల వలె ఊగిపోయాడు. శరీరంలో కలిపురుషుడు ప్రవేశించి వుండడం వల్ల నలుని బుద్ధి నశించింది. అందుచే మనస్సు ఊగిసలాటల తరువాత చివరకు నలుడు తన ప్రాణసమానురాలయిన భార్య దమయంతిని ఒంటరిగా వదిలివేసి అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

---

* న చైషా తేజసాశక్యా కైశ్చిద్ ధర్షయితుం పథి.
యశస్వినీ మహాభాగా మద్భక్తేయం పతివ్రతా! (మహా. వనపర్వం 62-14)



దమయంతి నిద్ర నుండి లేవగానే ఆమె కళ్ళు తెరచి చూసేసరికి నలుడక్కడ లేడు. ఆమె శంకాకుల చిత్తంతో ఇటుల అరవసాగింది! నా సర్వస్వమైన స్వామీ! మహారాజా! మీరెక్కడ ఉన్నారు? నేను ఒక్కతెనై భయపడుతున్నాను. నన్ను ఇంక ఎక్కువగా ఆట పట్టించకండి. నా స్వామీ ఎంధుకు కఠోరంగా ఉన్నారు? నన్నేలభయపెట్టుచున్నారు? ఎక్కడున్నారో దయతో వెంటనే కనిపించండి దర్శన మిప్పించండి.

భ్రమిస్తూ ఇలా ఇంకా అనుకొంటున్నది. నేను చూసేశానండి. మీరు లతల మాటున దాక్కున్నారు కదూ! ఇంకా మౌనాన్ని చాలించి బయటకు రండి. అవునుగాని నేను ఇంతగా విలపిస్తుంటే మీరు కనిపించి ధైర్యం ఇవ్వడం లేదేమిటి? స్వామీ! నాకు మీ గురించి తప్ప ఏ చీకూ చింతా లేదు. మీరు ఈ ఘోరారణ్యంలో ఇప్పుడు ఒక్కరే ఎలా వుండగలుగుతున్నారనేది నాకు చింతగా ఉన్నది. స్వామీ! ఎక్కడ ఉన్నారు? మీకు ఈ అరణ్యవాసాన్ని కల్పించిన దెవరో వారు మీ కంటె ఎక్కువ దుర్దశను పొంది, మిగుల కష్టమయ జీవితమును గడిపెదరు గాక! అంటూ దమయంతి వ్యాకుల చిత్తంతో విలపిస్తూ దిక్కుతోచక అటూ ఇటూ పరుగెత్తసాగింది. ఉన్మత్తురాలుగా అయిపోయింది. అలా ఆమె శోకగ్రస్తురాలై ఏం చేస్తోందో కూడా తెలియని దశలో అటునిటు పరుగెత్తుతు ఒక సర్పం దగ్గరకు చేరింది. పాము దగ్గరకు వెళ్ళాను అనే సంగతి కూడా తెలియని దుస్థితిలో ఆమె వున్నది. తనను ఆడించడానికి నలుడు చుట్టు ప్రక్కల ఎక్కడో వున్నాడనే భ్రాంతిలోనే ఆమె వుండి పోయింది. సర్పం దమయంతిని మ్రింగి వేయనుండగా కూడా ఆమెకు తన ప్రాణనాథుని స్మరణే, ఆయనచింతయే తప్ప మరొకటేమీ లేదు. ఆమె "స్వామీ! నన్ను అనాథగా అనుకుని ఈ మహాసర్పం మ్రింగి వేస్తోంది. నన్ను విడిపించడానికి మీరు పరుగెత్తుకు రారేమిటండీ?" – అని అరువసాగింది. ఈ అరుపులు ఒక వేటగాడి చెవుల్లో పడ్డాయి. అతడు అటువైపే తిరుగుతున్నాడు. అతడు ఆ అరుపులు విన్నవాడై పరిగెత్తుకుని వచ్చాడు. వచ్చి, తళ తళా మెరిసే తన ఆయుధంతో ఆ పాము ముఖాన్ని చీల్చి, ఆ విషసర్పం నుండి దమయంతిని విడిపించాడు. వేటగాడు దమయంతికి ధైర్యం చెప్పాడు. స్నానం చేయమన్నాడు. భోజనం చేయించాడు. దమయంతి కొంచెం శాంతపడి ఉండగా వేటగాడు "సుందరీ! నీవెవరవు? ఏవిధమైన కష్టాల్లో పడి ఇక్కడకు వచ్చావు? ఏ ఉద్దేశ్యంతో ఈ ప్రదేశానికి వచ్చావు?" అని అడిగాడు.



తనను రక్షించిన వేటగానికి దమయంతి తన కష్టాల కథను చెప్పింది. దమయంతి అందచందాలు, చక్కని మాట తీరు, మనోహరత్వం చూచి వేటగాడు కామమోహితుడై పోయాడు. తియ్యతియ్యని మాటలు అవీ ఇవీ చెప్పి ఆమెను తన దానిని చేసుకోవాలన్నట్లు ప్రవర్తించాడు. దమయంతి సాధారణ మహిళ కాదు. అతని చెడు ఆలోచనను అతని ప్రవర్తన వలన గ్రహించింది. దురాత్ముడైన ఆ వేటగాడి ఆంతర్యం

గ్రహించి దమయంతి క్రోధావేశంతో జ్వలించిపోయింది. అతని బలాత్కార చేష్టలకు దమయంతి మొదట సాధారణంగానే బదులు చెప్పాచు ఏవిధంగానూ అతనిని మార్చలేకపోయింది. అప్పుడింక దమయంతి గత్యంతరం లేక ఈ విధంగా శాపమిచ్చింది. "నేనే గనుక నిషధరాజు నలుని తప్ప మరొకరిని ఇష్టపడని దానినైతే, ఏ పరపురుషుని గురించి మనస్సులో చింతించని దాననే కనుక అయితే – ఈ పాపిష్ఠి వ్యాధుడు చచ్చిపోయి ఈ నేలమీదే పడిపోవును గాక!"



పతివ్రత దమయంతి నోటినుండి ఈ మాటలు రావడమే తడవుగా అతని ప్రాణాలు కోల్పోయి తెగిపడిన మోడులా నేలమీద కూలిపోయాడు.

ఆ వేటకాడు చనిపోయిన తరువాత నలుని గురించి వెతుకుతూ జనరహితమైన భయంకరమైన అరణ్యంలోకి చేరింది. కనబడిన పర్వతాలను నదులను, పశువులను, పక్షులను చివరకు పిశాచాలను – ఏవి కనబడితే వానిని నలుడెక్కడున్నాడు మీకు తెలుసా అని మతిభ్రమించిన దానివలె అడుగుతూ, ఉత్తర దిశగా వెళ్ళసాగింది. ఆ విధంగా తిరుగుతూండగా మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ గడిచిన తరువాత ఒక సుందర తపోవనాన్ని చూచింది. ఆ ఆశ్రమంలో మిత భోజనులు, సంయములు, పవిత్రులు, భృగు, అత్రి వంటివారితో సమానులైన ఋషులు నివసిస్తున్నారు. మృగ చర్మాలు ధరించి వున్నారు. ఇవన్నీ చూచి దమయంతికి ధైర్యం వచ్చింది. ఆమె ఆశ్రమంలోకి వెళ్ళి ఋషులకు సవినయంగా సమస్కరించింది. రెండు చేతులు కట్టుకుని నిలబడింది. ఋషులు 'స్వాగతమమ్మా' అని చెప్పి అతిథి సత్కారాలు చేశారు. తరువాత "కూర్చో అమ్మా! మేము నీకేమీ చేయవలసి వుంది" అని అన్నారు. దమయంతి సంస్కార పరిమళం గల మహిళగా "మీ తపస్సు బాగా సాగుతోందా? అగ్ని, ధర్మం, పశు పక్షులు ఇవన్నీ బాగున్నాయా? ధర్మాచరణకు ఏమీ విఘాతాలు రావడం లేదు కదా?" అని కుశల ప్రశ్నలు వేసింది "ఋషులు అమ్మా! మేమంతా కుశలంగానే వున్నాం, మాకన్నీ బాగానే వున్నాయి. కానీ ఇంతకీ నీవెవరవు? కల్యాణీ! ఎందుకొరకు నీ విక్కడకు వచ్చావు? నిన్ను చూస్తే మా కాశ్చర్యంగా ఉన్నది. ఏమిటీ నీవు వనపర్వత, నదుల అధిష్టాన దేవతవా?" అని అడిగారు. దమయంతి ఈ విధంగా జవాబిచ్చింది "మహాత్ములారా! నేను ఏ దేవతనూకాను. ఒక మనుష్యస్త్రీని మాత్రమే. నేను విదర్భరాజైన భీమకుని కుమార్తెను. బుద్ధిమంతుడు, యశస్వి, వీరుడు, విజయుడు నిషధ దేశమహారాజైన నలుని ధర్మపత్నిని, కపట ద్యూతంలో విశేష ప్రజ్ఞగల వానిచేత, దుష్టులచేత ద్యూత మాడడానికి నా భర్త

ప్రేరేపింపబడ్డారు. అందులో రాజ్యాన్ని, ధనాన్ని కోల్పోయారు. నేను ఆయన ధర్మపత్ని దమయంతిని. సందర్భ వశాన ఆయన నేను వేరుకావలసి వచ్చింది. యోధాగ్రేసురుడు, శస్త్రాస్త్ర విద్యాకుశలుడు, మహాత్ముడు అయిన నా భర్తను వెతుక్కుంటూ అరణ్యాలు తిరుగుతూ వచ్చాను. ఆయనను త్వరలో చూడడం జరుగకపోతే నేను జీవించి ఉండడం కష్టమౌతుంది. ఆయన ఎదుట లేని నా జీవితం నిష్ఫలంగా ఉన్నది. ఈ వియోగ దుఃఖాన్ని నేనింక ఎంతకాలం భరించాలి?"

దమయంతి మాటలను విన్నవారై ఋషులు "కళ్యాణీ! మేము విశుద్ధ తపోదృష్టితో చెబుతున్నాం. ముందు ముందు నీకు అనేక సుఖాలు లభ్యమవుతాయి. కొన్ని రోజుల్లోనే నలరాజు దర్శనమవుతుంది.* ధర్మాత్ముడైన నిషధరాజు కొద్ది రోజులలోనే సమస్త దుఃఖాలను దాటి సంపన్న దేశమైన నిషధ దేశాన్ని పాలిస్తాడు. ఆయనకు గల శత్రువులు భయంతో హడలిపోతారు. మిత్రులు సుఖపడతారు. బంధువులు తమలో నలుని చూచి ఆనందతరంగితులవుతారు." అని ధైర్యపూరిత వాక్యాలు, భవిష్య శుభాలుగా చెప్పారు. ఈ విధంగా చెప్పిన ఆ ఋషులు తమతమ ఆశ్రమాలతోపాటుగా అంతర్ధానమయ్యారు.

ఈ ఆశ్చర్యకర సంఘటనకు దమయంతి విస్మితురాలయింది. "ఎటువంటి సంఘటన! ఆ తాపసులు, పవిత్ర జలాల నదులు, ఫలపుష్ప హరిత భరితమైన వృక్షాలు, ఇవన్నీ ఎక్కడికి వెళ్ళిపోయాయి? ఓహో! నేనుగాని కల గన్నానా ఏమిటి?" అనుకుంది. దమయంతి మళ్ళీ ఉత్సాహరహితురాలయింది. ముఖం వాడినపుష్పంలా వుంది.

దమయంతి అక్కడినుండి వెళ్ళి విలపిస్తూ ఒక అశోక వృక్షం దగ్గరకు చేరింది. ఆమె కళ్ళనుండి అశ్రువులు జలజలమని రాలుతున్నాయి. ఆమె ఆ అశోక వృక్షంతో "శోకరహిత అశోక వృక్షమా! నీవు నా శోకాన్ని పోగొట్టవూ? నీవు గాని నలరాజుని శోకరహితునిగా

---

* ఉదర్కస్తవ కల్యాణి కల్యాణో భవితా శుభే
వయం పశ్యామ తపసా క్షిప్రం ద్రక్ష్యసి నైషధమ్" (మహా.వన.64–92)

చూచావా? ఓ అశోకమా! నీ శోకనాశక నామాన్ని సార్థకం చేసికోవూ!" అంది గాద్గదిక స్వరంతో.

దమయంతి అశోక వృక్షానికి ప్రదక్షిణ చేసింది. ఇంక తన ప్రయాణం – నలాన్వేషణాశయంతో మళ్ళీ ఆరంభించింది. భయంకర అరణ్యంలో – వృక్షాలు, పర్వత శిఖరాలు, గుహలు. అన్నీ చూచూకుంటూ నలుడు ఎక్కడుంటాడో అని తీవ్రంగా శోధిస్తూ చాలా దూరం వెళ్ళిపోయింది. ఆ విధంగా వెళ్ళాక దమయంతికి ఎన్నో ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలతోపాటుగా ఒక వ్యాపారుల గుంపు కనబడింది. ఆ వ్యాపురులలో ముఖ్యుడైన వానితో మాట్లాడాక, వారంతా సుబాహుని రాజ్యమైన చేది దేశానికి వెడుతున్నారని గ్రహించి వారితోపాటు తానూ వెళ్ళింది. మనస్సులో తన భర్తను ఎప్పుడు చూస్తానా అనే తపనతోనే ఆమె ప్రయాణిస్తోంది. చాలా రోజులు ప్రయాణం చేశాక ఆ వ్యాపారులు ఒక భయంకరమైన అరణ్యాన్ని చేరారు. అక్కడ ఒక అందమైన పెద్ద సరోవరం వుంది. దూర ప్రయాణం చేసి రావడం వల్ల వారంతా అలసిసొలసి వున్నారు. అందుచేత వారక్కడే విడిది చేశారు. దైవం వ్యాపారులకు ప్రతికూలంగా ఉంది. రాత్రి సమయాన అరణ్యపు ఏనుగులు యాత్రికుల ఏనుగులపై విరుచుకు పడ్డాయి. ఆ ఏనుగులకీ ఈ ఏనుగలకీ జరిగిన అల్లకల్లోలంలో వ్యాపారులందరూ నష్టభ్రష్టులయ్యారు. ఈ కోలాహలం విన్న దమయంతికి నిద్రాభంగమైంది. ఆమె ఆ మహాసంహార దృశ్యాన్ని చూసి పిచ్చిదానిలా అయింది.

ఆమె ఎప్పుడూ అటువంటి సంఘటన చూచి వుండలేదు. అందువల్ల ఆమె భయపడిపోయి, అక్కడ నుండి వెళ్ళిపోయి రక్షింపబడ్డ మనుష్యులున్న చోటికి వెళ్ళింది. తరువాత ఆ మహాసంహారంలో మిగిలిన వారైన పండితులూ, నిగ్రహశక్తిగల బ్రాహ్మణులతో కలిసి వెళ్ళసాగింది. అర్థవస్త్రధారణతోనే ఆమె ప్రయాణిస్తోంది. సాయంకాలానికి చేది రాజేంద్రుడైన సుబాహుకుని రాజధానిని చేరింది.




రాజధానిలో రాజపథంలో దమయంతి వెడుతున్నప్పుడు ఆమెను చూచిన నగర పౌరులు ఆమెను ఎవరో ఒక పిచ్చి మహిళ అనుకున్నారు. చిన్నారులు కొంతమంది ఆమె వెంటపడ్డారు. దమయంతి రాజమందిరాన్ని చేరింది. ఆ సమయంలో రాజమాత కిటికీలో కూర్చుని పిల్లలు వెంబడించగా వస్తూన్న దమయంతిని చూచి తన దాదితో "చూడు! ఆ సుందరి ఏదో బాధల్లో ఉన్నట్లుంది. తనకొక ఆశ్రయం వెదుకు

తున్నట్లుగా వుంది పాపం! నీవు వెళ్ళి ఆమెను నా దగ్గరకు తీసుకొనిరా" అని అంటూ "ఆమె ఎంత అందంగా ఉందంటే మన మందిరానికి ఆమెవస్తే మన మందిరమే మరింతగా వెలిగిపోయే విధంగా ఉంది" అని దయాపూర్వకంగా చెప్పగా దాది ఆమె ఆజ్ఞానుసారంగా ఆ సుందరిని రాజమందిరంలోనికి తీసుకు వచ్చింది.



దమయంతి రాజమందిరంలో అడుగిడగానే రాజమాత ఆమెతో "చూస్తాంటే నీవు చాలా కష్టాల్లో ఉన్నట్లున్నావు. అయినప్పటికీ నీ శరీరం ఇంత కాంతివంతంగా ఎలా వున్నది? చెప్పమ్మా! నువ్వెవరవు? ఎవరి భార్యవు? అసహాయ అవస్థలో ఉండి కూడా భయపడకుండా ఎలా ఉన్నావు?" అన్నది. దమయంతి ఈ విధంగా బదులు చెప్పింది –

"నేను ఒక పతివ్రతాస్త్రీని. కులీనురాలనే అయినప్పటికీ దాసీపని చేస్తున్నాను. అంతఃపురంలో ఉన్నదానను. నేను ఎక్కడైనా ఉండగలను. కందమూల ఫలాలను తింటూ కాలం గడుపగలను. నా పతిదేవుడు గుణవంతుడు. నన్ను చాలా ప్రేమగానే చూచుకునేవాడు. కానీ నా దురదృష్టవశాన – నా ఏ అపరాధమూ లేకుండా, రాత్రి సమయంలో నన్ను ఒక్కతెను నిద్రిస్తున్న సమయంలో వదిలిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయాడు. అప్పటి నుండి రాత్రి పగలూ అని లేకుండా ఆయన గురించి తిరుగుతూ వియోగ బాధలో తపించిపోతున్నాను". ఈ విధంగా చెబుతూ ఉండగా ఆమె కన్నీళ్ళు ధారగట్టాయి. ఆమె ఏడువ సాగింది. దమయంతి కథనం విని రాజమాత కరగిపోయింది. ఆమె "కళ్యాణీ! నాకు సహజంగానే నీపై ప్రేమ కలుగుతున్నది. నీవు నావద్దనే ఉండు. నీ పతి ఎక్కడ ఉన్నాడో గట్టిగా వెదకేపని నేను చూస్తాను. నీ భర్త ఎప్పుడు వస్తాడో, అప్పుడు ఇక్కడే కలిసికొందువుగాని" అని నమ్మకంగా మాట్లాడింది. దమయంతి 'మాతా! నేను కొన్ని షరతులమీద మీవద్ద నుంటాను.* "నేను ఎంగిళ్ళు తినను. ఎవరికాళ్ళూ పట్టను. ఏ పరపురుషునితోనూ ఏ

* ఉచ్ఛిష్టం నైవ భుంజీయాం నకుర్యాం పాదధావనమ్
న చాహం పురుషానన్యాన్ ప్రభాషేయం కథంచన
ప్రార్థయేత్ యది మాం కశ్చిద్ దండ్యస్తేసపుమాన్ భవేత్
వధ్యశ్చ తేఽసకృన్మన్ద ఇతి మే వ్రతమాహితమ్
భర్తురన్వేషణార్థంతు పశ్యేయం బ్రాహ్మణానహమ్
యద్యేవమిహ వత్స్యామిత్వత్సకాశే న సంశయః.(మహా.వన.65/68 నుండి 70)

పురుషుడైనా నాపట్ల దుశ్చేష్టలతో ప్రవర్తిస్తే అతనిని దండించవలెను. దండించినా మళ్ళీ మళ్లీ దుశ్చేష్టల్లోనే ఉంటే అటువంటి వ్యక్తికి ప్రాణ శిక్షనైనా వేయాలి. నేను నా భర్తను అన్వేషించడంలో బ్రాహ్మణులతో మాట్లాడుచుండెదను. దయతో మీరీ షరతులను అంగీకరిస్తే నేనిక్కడ ఉండగలను. ఈ విధంగా అంటున్నానని అన్యథా భావించకండి" అని నెమ్మదిగా వివరించింది.

దమయంతి నియమాలను రాజమాత విని చాలా ప్రసన్నురాలైనది. అలాగేనమ్మా అన్నది. అప్పుడా రాజమాత తన పుత్రిక సునందని పిలిచి "బిడ్డా! ఈ దాసిని దేవిగా భావించాలి. ఈమె వయసులో నీతో సమానంగా ఉంది. అందుచేత ఈమెను స్నేహితురాలిగా చూచుకుంటూ రాజమందిరంలో ఉంచాలి. ఈమె ఎడ ప్రసన్నంగా ఉంటూ మనస్సుకు ఉల్లాసం కలిగిస్తూ వుండు" అనగా సునంద సంతోషంతో దమయంతిని తన మందిరానికి తీసికుని వెళ్ళింది. దమయంతి తన ఇచ్ఛానుసారంగా తన నియమాలను పాలిస్తూ, సునందతో మందిరంలో నివసింప సాగింది.

* * *

# నలుని రూపము మారుట

## ఋతుపర్ణునికి సారథి అగుట
## భీముని ద్వారా నల దమయంతులను వెదుకుట
## దమయంతి లభించుట

బృహదశ్వులు చెబుతున్నారు – 'యుధిష్ఠిరుడా! పడుకున్న దమయంతిని నలుడు వదలి వచ్చినప్పుడు ఒక సంఘటన జరిగింది. ఆ సమయంలో అరణ్యంలో దావాగ్ని రగులుకొంది. నలుడు తటాలున నిల్చున్నాడు.'

"రాజా! నలుడా! శీఘ్రంగా పరుగెత్తుకునిరా! నన్ను రక్షించుము" అనే పిలుపు వినబడింది. "భయపడ వద్దు" అన్నాడు నలుడు. ఆయన పరుగెత్తి దావానలంలో ప్రవేశించి, చుట్టచుట్టుకొని, కర్కోటక నాగరాజు పడి వుండడం చూచాడు. నాగరాజు చేతులు జోడించి "రాజా! నేను కర్కోటకుడనే పేరుగల సర్పాన్ని. నేను తేజస్వియగు నారదమహర్షిని మోసగించాను. అందువలన నారదుడు "నలుడు వచ్చి లేవదీసేటంత వరకూ ఇక్కడే పడివుండు" అని నాకు శాపమిచ్చాడు. నలుడు వచ్చి నిన్ను బయటకు తీసుకు వస్తేనే నీకు శాపవిమోచన అని నారదుడు చెప్పా"డని నలునితో కర్కోటకుడు చెప్పాడు. అట్టి శాప కారణంగా తాను ఇచటి నుండి ఒక అడుగైనా కదిలించకుండా ఉన్నానని మొరబెట్టుకున్నాడు. ఓ నలరాజా! నీవు నాకు శాపవిమోచనము చేయుము. నేను నీకు మిత్రుడనవుతాను. నీకు హితము చేకూర్చు వచనాలు చెబుతాను. నేను చాలా బరువున్నానని భయపడకు. ఇప్పుడే తేలికగా మారగలను." అని చెప్పెను.

దయామయుడైన నలుడు బొటనవ్రేలితో సమానంగా మారిన కర్కోటక సర్పాన్ని లేవదీసి దావానలం నుండి బయటకు తెచ్చాడు. అప్పుడు కర్కోటకుడు – "రాజా! నన్ను నీవు భూమి మీద పడేయకుము.

కొన్ని అడుగుల వరకూ లెక్కబెడుతూ వెళ్ళు అన్నాడు. నలమహారాజు కర్కోటకుడు చెప్పినట్లు నడుస్తూ అడుగులు లెక్కబెడుతూ పదవ అడుగు సంఖ్య దశ అనగానే కర్కోటకుడు నలుని కాటువేశాడు. (పది) 'దశ' అని నలుడు ఉచ్చరించిన శబ్దానికి దీటుగా కాటువేయమనే అర్థం వచ్చేటట్లు భావించుకోవాలని కర్కోటకుని నియమం. అంతకంటే మరో భావన లేదు. కర్కోటకుడు కాటువేయగానే నలుని రూపం మారిపోయింది. కర్కోటకునికేమో తన అసలు స్వరూపం వచ్చింది.



ఈ సంఘటనకు ఆశ్చర్యచకితుడయిన నలుని చూస్తూ కర్కోటకుడు "రాజా! ఇప్పుడు నీవెవ్వరవో ఎవ్వరూ పసిగట్టలేరు. ఇందుగురించే నేను నీ రూపాన్ని మార్చివేశాను. కలి పురుషుడు నీ శరీరంలో ప్రవేశించి నీకు చాలా దుఃఖాలను కలుగజేశాడు. ఇప్పుడు నీ శరీరంలో నా విషం ఉండడం వల్ల ఆ కలిపురుషుడు చాలా దుఃఖాన్ని అనుభవిస్తాడు.* నీవు నన్ను రక్షించావు. ఇప్పుడు నిన్ను బాధించే పశు పక్షుల వలన, శత్రువుల వలన అంతేకాదు బ్రహ్మవేత్తల శాపాల వలన కూడా నీకు భయంలేదు, ఉండదు. ఇప్పుడు నీపై ఏ విష ప్రభావము వుండబోదు. అంతేకాక ఇక యుద్ధాలలో నీవే జయిస్తావు. ఇప్పుడు నీపేరు బాహుకుడు అని మార్చుకో. ద్యూత కుశలుడైన ఋతుపర్ణరాజు నగరమైన అయోధ్యకు వెళ్ళు. నీవు ఆయనకు అశ్వ విద్యారహస్యాలు బోధించు. ఆయన నీకు ద్యూత విద్యా రహస్యాలు బోధిస్తాడు. ఆ విధంగా ఆయన నీకు మిత్రుడవుతాడు. ద్యూత రహస్యాలను నీవు నేర్చుకున్న పిదప నీ ధర్మపత్ని, పుత్రిక, పుత్రుడు, రాజ్యం ఒకటేమిటి అన్నియును లభింపగలవు. నీకు, నీ పూర్వం ఉండే రూపం అవసరమని భావించినప్పుడు నన్ను తలుచుకో నేనిచ్చే వస్త్రాన్ని ధరించు. అని చెప్పి కర్కోటకుడు నలునికి రెండు దివ్య వస్త్రాలను బహూకరించి అక్కడే అంతర్ధానమయ్యాడు."

నలమహారాజు అక్కడ నుండి బయలుదేరి పదవరోజుకు ఋతుపర్ణరాజు రాజధాని అయోధ్యకు చేరాడు. నలుడు రాజ దర్బారులోకి వెళ్ళి "నా పేరు బాహుకుడు. నేను గుఱ్ఱములను రకరకాలుగా నడపడం వంటి అశ్వ విద్యా నైపుణ్యాలు తెలిసిన వాడను. అశ్వ విద్యలో నాతో

---

* యత్కృతే చాసి నికృతో దుఃఖేన మహతా నల!
విషేణ స మదీయేన త్వయి దుఃఖం నివత్స్యతి.
న తే భయం నరవ్యాఘ్రదంష్ట్రిభ్యః శత్రుతోఽపి వా
బ్రహ్మవిద్భ్యశ్చ భవితా మత్ప్రసాదాన్నరాధిప!
రాజన్ విషనిమిత్తా చ న తే పీడా భవిష్యతి
సంగ్రామేషు చ రాజేంద్ర! శశ్వజ్జయమవాప్స్యసి. (మహా.వన.66/15,18నుండి19)

సమానంగా నైపుణ్యం గల వాడు వేరొకడు ఈ భూమి మీదనే లేడు ఆర్థిక సంబంధమగు గంభీర సమస్యలలో సైతం కొన్ని సలహాలు ఇవ్వగల వాడను. అంతేగాదు పాక విద్యలో నేను ఆరిదేరినవాడను. రకరకాల వంటలు ఎన్నో చేయగలవాణ్ణి. హస్తకౌశలానికి సంబంధించిన అనేకమైన పనులు చేయగలను. సుకుమారమైనవే కావు కఠినమైన పనులు కూడా నిర్వర్తించగలను. కనుక తాము నాకు జీవన భృతి



నిర్ణయించి నన్ను మీ వద్ద పెట్టుకొనుడు." అని విన్నవించుకున్నాడు. అప్పుడు ఋతుపర్ణుడు "బాహుకా! నీవు బహు చక్కగా వచ్చావు. నీ నైపుణ్యాలకు సంబంధించిన అన్ని పనులూ నీకు బాధ్యతగా ఉంటాయి. అయితే శీఘ్రంగా వెళ్ళే రథాలంటే నాకు చాలా యిష్టం. అశ్వాలను నడిపించడం, వానికి సంబంధించిన మెలకువలు తెలిసినవాడవన్నావు కనుక నిన్ను నేను మా అశ్వశాలకు అధ్యక్షునిగా చేస్తున్నాను. నీకు ప్రతినెల పదివేల బంగారు నాణెములు లభింపగలవు. దీనితోపాటుగా వార్ష్ణేయుడూ (నలుని పూర్వరథసారథి) జీవలుడూ ఎప్పుడూ నీవద్దనే ఉంటుంటారు. నీవు ఆనందంగా నా ఆస్థానంలో ఉండుము" అన్నాడు. ఋతుపర్ణరాజు సత్కారాలను గ్రహించిన వాడైన నలుడు బాహుకుని రూపంలో వార్ష్ణేయునితో, జీవలునితో అయోధ్యలో నివసింప సాగాడు. అయితే ప్రతిరోజూ నలుడు రాత్రివేళలలో దమయంతిని స్మరిస్తూ "అయ్యో! ఆకలి దప్పులతో దమయంతీ నీవెక్కడనున్నావు? ఏం చేస్తున్నావు? ఎక్కడ నిద్రపోతున్నావు? అని అనుకుంటూ ఆమె తన జీవన నిర్వహణార్థం ఎవరివద్దకు వెడుతూందో కదా! అని అనుకునేవాడు. శత విధాల దమయంతిని గురించి ఆలోచించేవాడు, ఇలా ఎన్నో అనుకున్నా తనను ఎవరూ గుర్తించ కుండునట్లుగా ఋతుపర్ణరాజు వద్ద ఉండసాగెను.

విదర్భనరేంద్రుడగు భీమునకు తన అల్లుడు రాజ్యాదులన్నీ పోగొట్టుకుని తన కుమార్తెతో అరణ్యాలు పట్టినాడను వార్త తెలిసింది. అప్పుడతడు బ్రాహ్మణులను పిలిపించి, వారికి చాలా ధనమిచ్చుకొని "ఓ బ్రాహ్మణులారా! ఈ భూమి మీద మీరు అన్నిప్రాంతాలకూ వెళ్ళి నలదమయంతుల ఆచూకీ తెలుసుకుని, వారిని వెదకి తీసుకురండి. ఏ బ్రాహ్మణుడయితే ఈ పనిని పూర్తిగా నిర్వర్తించగలడో, ఆయనకు ఒక వేయి ఆవులూ, భూమీ ఇవ్వబడతాయి. వారినితీసుకొని రాలేకపోయినా, కనీసం ఆచూకీ చెబితే చాలు పదివేల ఆవులివ్వబడతాయి." ఇందుకు బ్రాహ్మణులు చాలా ప్రసన్నులై నలదమయంతులను వెదకడానికి బయలుదేరారు.

సుదేవుడనే పేరుగల బ్రాహ్మణుడు నలదమయంతుల ఆచూకీ తెలుసుకోవడానికి చేది నరేంద్రుని రాజధానికి వెళ్ళాడు. ఆయన ఒకరోజున రాజమందిరంలో దమయంతిని చూశాడు. ఆరోజున రాజమందిరంలో పుణ్యాహవాచనం జరుగుతోంది. దమయంతి, సునందలిద్దరూ ఒకేచోట కూర్చుని మంగళ కృత్యాలు తిలకించుచుండిరి. బ్రాహ్మణుడు సుదేవుడు దమయంతిని చూసి నిజానికి ఈమెయే భీముని కుమార్తె.



నేను ఆమె రూపాన్ని మునుపు ఏవిధంగా చూచానో, ఇప్పుడు కూడా ఆమెను ఆవిధంగానే చూస్తున్నాను. చాలా మంచి పని జరిగింది. ఈమెను చూడడం వల్ల నా యాత్ర సఫలీకృతమైనది. సుదేవుడు దమయంతి వద్దకు వెళ్ళి ఇలా అన్నాడు – 'విదర్భ నందినీ! నేను నీ సోదరుని మిత్రుడను, బ్రాహ్మణుడను, సుదేవుడను. భీమరాజు ఆజ్ఞానుసారంగా నిన్ను వెతుకుతూ ఇక్కడకు రావడం జరిగింది.



నీ తల్లిదండ్రులూ, సోదరులూ ఆనందంగా ఉన్నారు. నీ యిద్దరి బిడ్డలూ విదర్భ దేశంలో కుశలంగా ఆనందంగా ఉన్నారు. నీ వియోగం వల్ల నీ కుటుంబీకులందఱూ ప్రాణహీనులుగా ఉంటున్నారు. నీవెక్కడున్నావో అని వందలకొలది బ్రాహ్మణులు వెదుకుతూ భూమి అంతటా తిరుగుచున్నారు." ఆ బ్రాహ్మణుని దమయంతి గుర్తు పట్టింది. ఆమె క్రమక్రమంగా ఒక్కొక్కరి గురించిన కుశలప్రశ్నలు వేయసాగింది. దమయంతి మాట్లాడుతూ ఏడ్వడం చూచిన సునంద కంగారుపడి వెళ్ళి తల్లికి సంగతంతా చెప్పింది. రాజమాత వెంటనే అంతఃపురం వదలి బయటకు వచ్చి బ్రాహ్మణుని అడుగసాగింది – "ఓ మహానుభావా! ఈమె ఎవరి కూతురు? ఎవరి భార్య? తన ఇంటివారితో ఏవిధంగా విడిపోయింది? మీరు ఈమెను ఏవిధంగా గుర్తించగలిగారు?" సుదేవుడు – నలదమయంతుల చరిత్ర యావత్తూ ఆ రాజమాతకు పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. నివురుగప్పిన నిప్పును వేడితో గుర్తించినట్లుగా దమయంతి సుందర రూపాన్ని బట్టి ఆమె లలాటాన్ని బట్టి ఆమెను దమయంతిగా గుర్తించగలిగానని చెప్పాడు. సునంద, దమయంతి ముఖాన్ని తన చేతులతో కడిగింది. తద్వారా దమయంతి కనుబొమ్మల నడుమ ఎఱ్ఱని చిహ్నం చంద్రునితో సమానమైన కాంతితో ప్రకటితమయింది. దమయంతి లలాటం మీదనున్న పుట్టుమచ్చను చూచి సునంద, రాజమాత విలపించారు. వారు రెండు ఘడియలపాటు ఆమెను హృదయానికి హత్తుకుని ఆప్యాయత గురిపించారు. రాజమాత "దమయంతీ! నేను ఈ పుట్టుమచ్చను గమనించాక నీవు నా సోదరి పుత్రికవని గ్రహించాను. నీ తల్లి నాకు స్వయానా సోదరి. మేము ఇరువురము దశార్ణ దేశ రాజు అయిన సుదాముని పుత్రికలము. నీ పుట్టుక మా నాన్నగారింటనే జరిగింది. అప్పుడు నేను నిన్ను చూచాను. మీ నాన్నగారి యిల్లు నీకెటువంటిదో ఈ మా యిల్లు కూడా అటువంటిదే. ఈ సంపదలు నా వన్నీ నీవే" అని ప్రేమ నిండిన హృదయంతో అనగా దమయంతి చాలా ఆనందించిది. ఆమె తన తల్లి సోదరికి ప్రణమిల్లి

"అమ్మా! నీవు నన్ను గుర్తెరుగక పోతే ఏమిటి? నేను ఇక్కడ ఒక కూతురు వలెనే ఉన్నాను. నాకు కావలసిన వన్నీ ఇచ్చావు. అంతేకాదు నన్ను రక్షించావు. ఇంక ఇప్పుడు నేనెవరినో తెలిశాక సందేహమేమీ లేదు. ఇక్కడ ఇంకా సుఖపడగలను. కానీ నేను చాలా రోజులనుండి తిరుగుతూనే వున్నాను. నా చిన్నారులిద్దరూ నాన్నగారింట్లోనే వున్నారు. వారు తమ తండ్రి యొక్క వియోగం వలన దుఃఖిస్తూ ఉంటారు. వాళ్ళ పరిస్థితి ఇప్పుడు ఎలా వుందో ఏమిటో? అమ్మా! నీవు నా మేలు నభిలషిస్తే నన్ను విదర్భ దేశానికి పంపించి నా అభీష్టాన్ని నెరవేర్చు" మని వేడుకుంది - ఆ మాటలకు రాజమాత ఎంతగానో ప్రసన్నురాలైంది. ఆమె తన కుమారుని పిలిపించి పల్లకీ తెప్పించింది. ఆహారం, వస్త్రాలు ఎన్నో వస్తువులు ఇచ్చి, సంరక్షణార్థం సైన్యాన్ని కూడా ఇచ్చి వీడుకోలు పలికింది. విదర్భ దేశం దమయంతిని ఎంతగానో గౌరవించింది. దమయంతి తన సోదరులు, పిల్లలు, తల్లిదండ్రులు, స్నేహితురాండ్రు - అందరినీ చూసి, కలిసి ఆనందించింది. ఆమె దేవతలను, బ్రాహ్మణులను పూజించింది. భీమరాజు తన పుత్రిక లభించినందుకు ఆనందతరంగితుడయ్యాడు. బ్రాహ్మణుడైన సుదేవునకు వేయి ఆవులు, ఒక గ్రామము, ధనము ఇచ్చి సంతుష్టి పరచెను.'

★ ★ ★

# నలునికై అన్వేషణ

## ఋతుపర్ణుని విదర్భయాత్ర - కలి నిష్క్రమణ

బృహదశ్వులవారు యుధిష్ఠిరునికి చెప్పసాగారు – "యుధిష్ఠిరుడా! తన తండ్రి యింటికి వచ్చాక, దమయంతి ఒకరోజు విశ్రాంతి తీసుకుంది. తదుపరి తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా! నేను నిజం చెబుతున్నాను విను. నేను నా భర్తలేకపోతే జీవించలేను. నేను జీవించాలి అంటే నాపతి దేవుని అన్వేషించే కార్యక్రమాన్ని ముమ్మరంగా చేబట్టండి" అని హృదయం విప్పిచెప్పింది. మహారాణి మాతృహృదయం కరిగి కన్నీళ్ళు కార్చింది. ఆమె తన భర్తతో "స్వామీ! దమయంతి తన భర్త గురించి మిగుల వ్యాకుల చిత్తంతో ఉన్నది. సంకోచ రహితంగా నాతో ఆమె తనపతిని వెతికే పని చేయించవలసిందిగా చెప్పింది." అప్పుడు రాజు తన ఆశ్రితులైన బ్రాహ్మణులను పిలిపించాడు. నలుని వెదకవలసిందిగా వారిని ఆదేశించాడు. బ్రాహ్మణులు దమయంతి చెంతకేగి "మేమిప్పుడు నలుని జాడ వెదకుటకు వెడుతున్నాము" అన్నారు. దమయంతి బ్రాహ్మణులతో "మీరు ఏ దేశానికి వెళ్ళినప్పటికీ అక్కడ మనుష్య సమూహాలనుద్దేశించి ఈ మాటలు చెప్పండి. "నా ప్రియమైన మోసగాడా! నువ్వు నా చీరలోని సగభాగాన్ని ఖండించి పడుకున్న నీ చరణ దాసిని వదిలి ఎక్కడకు వెళ్ళావు? నీ చరణదాసి ఇప్పుడు కూడా ఆ దురవస్థలో సగం చీర కట్టుకుని నీ రాకకై ఎదురుచూస్తూ నీ వియోగంలో ఎంతో దుఃఖితురాలై వుంది." ఈ విధంగా చెబుతూ ఆయన ఎదుట నాపరిస్థితి వర్ణించి చెప్పండి.*

---

* క్వ ను త్వం కితవచ్ఛిత్త్వా వస్త్రార్ధం ప్రస్థితో మమ
ఉత్సృజ్య విపినే సుప్తా మనురక్తాం ప్రియాంప్రియ!
సా వై యథాత్వయా దృష్టా తథాఽఽస్తే త్వత్ప్రతీక్షిణీ
దహ్యమానా భృశం బాలా వస్త్రార్ధేనాభి సంవృతా. (మహా.వన.69-37)

ఆయన ప్రసన్నుడయ్యే విధంగా మాట్లాడండి. నా మాటలు విని ఆయన మీతో ఏదేని జవాబు చెప్పెనేని, ఆయన ఏమంటాడో జాగ్రత్తగా విని అతడెవరు? ఎక్కడుంటాడు? అని తెలుసుకొని రండి. నా ఆజ్ఞానుసారంగా ఈ మాటలు చెప్పినట్లుగా అతనికి తెలియ నివ్వకండి." బ్రాహ్మణ గణము దమయంతి ఆజ్ఞానుసారంగా నలుని అన్వేషణకై బయలుదేరింది.



చాలా రోజులు అన్వేషించిన తరువాత పర్ణాదుడనే పేరుగల బ్రాహ్మణుడు దమయంతి ఉన్న మందిరానికి వచ్చి "రాజకుమారీ! మీ ఆజ్ఞానుసారం బయలుదేరాను నిషధ నరేంద్రుడు నలుని జాడ తెలిసికొనడానికి క్రమంగా అయోధ్యానగరం వెళ్ళాను. అక్కడ నేను ఋతుపర్ణరాజు సభలోకి వెళ్ళి నిండు సభలో మీ మాటలు చెప్పాను. అయితే అక్కడ ఎవ్వరూ స్పందించలేదు, జవాబివ్వలేదు. కాని నేను అక్కడ నుండి వెళ్ళి పోతుంటే బాహుకుడనే పేరుగల సారథి నన్ను ఏకాంతంగా కలిసి కొంచెం చెప్పాడు. ఆ సారథి ఋతుపర్ణరాజుగారి గుఱ్ఱములకు శిక్షణ యిచ్చుచున్నాడు. రుచికరమైన భోజనాదులు తయారుచేస్తున్నాడు. కాని ఆయన శరీరం కురూపంగా ఉండి, పొట్టి చేతులతో ఉన్నాడు. ఆయన పెద్దగా శ్వాసపీల్చుకుని రోదిస్తూ చెప్పాడు కదా* "కులీన స్త్రీలు తమకు ఘోర కష్టాలు వాటిల్లినప్పటికీ తమ శీలాన్ని రక్షించుకుంటారు. వారు తమ పాతివ్రత్యబలంతో స్వర్గాన్ని సైతం జయించగలవారు. ఎప్పుడైనా ఒకవేళ భర్త విడిచి పెట్టినా కోపగించరు. తమ సదాచారములను రక్షించుకొనెదరు. విడిచిపెట్టిన పురుషుడు ఆపదలో చిక్కిన కారణంగా దుఃఖంతో బాధ పడుతున్నప్పుడు ఆయనపై కోపగించడం సముచితముకాదు. పతి తన పత్నిని సరిగా ఆదరించలేదనుమాట అంగీకరింతును. కాని అప్పుడతడు రాజ్య భ్రష్టుడై, ఆకలిగొన్న వాడై, దురాశకు లోనై యుండెను. ఇట్టి దురవస్థలోనున్న అతనిపై కోపగించుట ఉచితము కాదు. ప్రాణరక్షణార్థం ఆయన జీవనోపాధికై వెతుకులాడే సందర్భంలో పక్షులు ఆయన వస్త్రాన్ని ఎత్తుకుపోయాయి. అప్పుడాయన హృదయ బాధ సహించరానిది" రాజకుమారీ! దమయంతీ! ఇప్పుడు నేను చెప్పినవన్నీ బాహుకుడు నాతో చెప్పినవి. నేను వాటిని మీతో చెప్పాను.

---

* వైషమ్య మపి సంప్రాప్తా గోపాయన్తి కులస్త్రియః।
ఆత్మానమాత్మనా సత్యో జితః స్వర్గో న సంశయః ॥
రహితా భర్తృభిశ్చైవ నకుప్యన్తి కదాచన ।
ప్రాణాశ్చారిత్ర కవచాన్ ధారయన్తి వరస్త్రియః॥

ఎట్లు సముచిత మనుకుంటే ఆ విధంగా చేయవచ్చును. అభ్యంతరం లేకపోతే మహారాజుతో కూడా చెప్పాము."

బ్రాహ్మణుడు చెప్పినది ఆమూలాగ్రం విన్న దమయంతికి కళ్ళు అశ్రువులతో నిండిపోయాయి. ఆమె తన తల్లితో ఏకాంత వేళలో "అమ్మా! ఇప్పుడు నేను చెప్పేది నాన్నగారితో చెప్పవద్దు. నేను బ్రాహ్మణుడు సుదేవుని ఈ కార్యక్రమంలో నియమించెదను. సుదేవుడు



నన్ను మంచి ముహూర్తంలో ఇక్కడకు చేర్చాడు. అటులే ఇప్పుడు అతడొక మంచి ముహూర్తం చూసుకుని అయోధ్యకు వెళ్ళును. అచటనున్న నా పతిదేవుని తీసుకురావడానికి యుక్తితో ప్రయత్నించును గాక! అని మనోగతాన్ని అవగతం చేసింది. తరువాత దమయంతి తనకు బాహుకుని వృత్తాంతాన్ని తీసుకువచ్చిన పర్ణాదుని సగౌరవంగా సత్కరించింది. అయనకు కృతజ్ఞతలు చెప్పి వీడుకోలు పలికినది సుదేవుని పిలిపించి అతనితో నిట్లు చెప్పినది –

'దైవస్వరూపుడవైన బ్రాహ్మణుడా! మీరు శీఘ్రంగా అయోధ్యానగరం వెళ్ళండి. ఋతుపర్ణరాజును కలిసి, "భీముని పుత్రిక దమయంతి తాను మళ్ళీ స్వయంవరం ఏర్పాటు చేయించుకుని ఆ స్వయంవరంలో స్వేచ్ఛానుసారంగా పతిని వరించాలని భావిస్తోంది. గొప్ప – గొప్ప రాజులు, రాజకుమారులు వెళ్ళుచున్నారు. రేపే స్వయంవరం. ఇందుచేత రేపటికి మీరు అక్కడకు చేరుకునేలా వెళ్ళ గలిగితేనే వెళ్ళండి. నలుడున్నాడో, లేదో ఎవ్వరికీ తెలియదు. అందుచేతనే దమయంతి రెండవ భర్తను రేపటి సూర్యోదయ సమయాన వరించనున్నది" అని చెప్పండి. దమయంతి మాటలు విన్నవాడై సుదేవుడు అయోధ్యకు బయలుదేరాడు. ఋతుపర్ణునితో చెప్పవలసినదంతా చెప్పాడు.'

ఋతుపర్ణుడు సుదేవుని మాటలు వినిన తరువాత బాహుకుని పిలిచి సుమధుర వాణితో "బాహుకా! రేపు దమయంతీ స్వయంవరం. ఒకే ఒక్క రోజులో నేను విదర్భ దేశం చేరాలని భావిస్తున్నాను. కాని, ఇంత త్వరితంగా అక్కడికి చేరుట సంభవమని నీవు భావించినప్పుడే నేను అచటికి వెళ్లెదను." అన్నాడు. ఋతుపర్ణుని మాటలు విని నలుని హృదయం పగిలినట్లయింది. "ఏమిటీ! దమయంతి దుఃఖం వల్ల చైతన్యాన్ని కోలుపోయి రెండవ స్వయంవరానికి ఇష్టపడిందా? లేకపోతే!, ఆమె ఏమిటి? ఆమె స్వభావమేమిటి? ఆమె అటువంటిది కాదే! ఇది సరికాక పోవచ్చు. నేను ఆమెకు లభించడానికీ, నాజాడను కనుగొనడానికే ఈ యుక్తి పన్నివుంటుంది. ఆమె పతివ్రత, తపస్విని, దీనురాలు. నేనే దుర్బిద్ధితో ఆమెను త్యజించడం ద్వారా చాలా

క్రూరంగా ప్రవర్తించాను. తప్పునాదే. ఆమె ఎప్పుడూ మరొకరిని ఆశించదు. సరే! ఇంతకీ నిజానిజాలు అక్కడికి వెళ్ళాక కానీ తెలియవు కదా! అయినా ఋతుపర్ణుని అయోధ్యకు సమయానికి తీసుకువెళ్ళడంలో నా స్వార్థమూ వుంది కదా" అని నలుడు మనస్సులో తర్జన భర్జనలు చేసుకున్నవాడై, చేతులు జోడించి ఇట్లనెను. "మీ మాటను అనుసరించి నేను పని చేస్తా నని ప్రతిజ్ఞ చేస్తూ వున్నాను." బాహుకుడు అశ్వశాలకు వెళ్ళి శ్రేష్ఠమైన అశ్వాలను పరీక్షించాడు. ఉత్తమ



జాతి అశ్వాలను నాలుగింటిని – శీఘ్రంగా పరుగెత్తే వాటిని తీసుకొనివచ్చి రథానికి కట్టాడు. ఋతుపర్ణరాజు రథాన్ని అధిరోహించాడు.

ఆకాశంలో పక్షులు ఏ విధంగా ఎగురుతూ ప్రయాణిస్తాయో ఆ విధంగా బాహుకుని రథం కొద్ది సేపటిలోనే నదులను, పర్వతాలను, అరణ్యాలను దాటి ప్రయాణించసాగింది. అత్యంత వేగంగా రథం ప్రయాణిస్తోంది. ఒక ప్రదేశంలో ఋతుపర్ణుని క్రింద శాలువ పడిపోయింది. ఆయన "బాహుకా! రథం ఆపు. వార్ష్ణేయుని దానిని తీసుకుని రమ్మంటా" నన్నాడు. బాహుకుడన్నాడుగదా "మీ వస్త్రం ఇప్పుడే పడిపోయింది. కాని మనం ఆ వస్త్రం పడిపోయిన ప్రాంతం దాటి ఒక యోజన దూరం దాటివచ్చేశాము. ఇప్పుడు వార్ష్ణేయుడు దానిని తీసుకురాలే" డన్నాడు. ఇలా మాట్లాడుతున్నప్పటి సమయానికి ఆ రథం ఒక వనంలో ప్రయాణిస్తోంది. ఋతుపర్ణుడు "బాహుకా! నీవు నా గణిత విద్యా నైపుణ్యాన్ని దర్శించు. ఎదురుగా ఉన్న చెట్టు మీద ఎన్ని ఆకులు, పళ్ళు కనబడుతున్నాయో వానికంటె భూమిమీద పడివున్న పళ్ళూ, ఆకులు నూటొక్క రెట్లు అధికంగా ఉన్నాయి. ఈ వృక్షం యొక్క రెండు కొమ్మల మరియు రెమ్మల మీద అయిదుకోట్ల ఆకులు, రెండు వేల తొంభై అయిదు పళ్ళూ ఉన్నాయి. లెక్కబెట్టాలని వుంటే లెక్కబెట్టుకో" అన్నాడు. బాహుకుడు రథం ఆపి, అన్నాడు కదా "నేను ఈ తాండ్ర(తాని) వృక్షాన్ని ఖండించి పండ్లనూ, ఆకులనూ లెక్క బెట్టాలని నిశ్చయించుకున్నాను" బాహుకుడు ఆ విధంగా లెక్క బెట్టాడు. రాజు చెప్పిన విధంగా వృక్షం యొక్క పత్రాలూ, ఫలాలు సరిగ్గా ఉండడం చూసి నలుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. బాహుకుడు అన్నాడు "రాజా మీ గణిత విద్య అద్భుతంగా ఉన్నది. మీరు మీ విద్యను తెలియచెప్పండి".

ఋతుపర్ణుడు – "గణిత విద్యేకాదు, నాకు పాచికలను వశీకరణ చేసుకునే విద్యకూడా వచ్చును అందులోనూ నేను నిపుణుడను".

బాహుకుడు "అయితే నాకు మీ రా విద్య నేర్పితే, మీకు నేను అశ్వవిద్య నేర్పుతాను."

ఋతుపర్ణునకు తాను విదర్భ దేశానికి సత్వరమే వెళ్లాలని ఉంది. అదే సమయంలో, అశ్వ విద్యను నేర్చుకోవాలనే ఆశ కూడా వుంది. అందువలన నలరాజుకు ఋతుపర్ణుడు పాచికల విద్య నేర్పినాడు. నేర్పి "అశ్వవిద్య నీవు నాకు తరువాత నేర్పుదువుగాని; నేనడిగినప్పుడు నేర్పడానికై ఈ విద్యను నీవద్ద ధరావత్తుగా పెట్టుకోమన్నాడు."

నలమహారాజు పాచికల విద్య నేర్చుకొనేటప్పుడు, కర్కోటక సర్పముయొక్క తీవ్ర విషాన్ని వెళ్గ్రక్కుతూ నలుని శరీరం నుండి 'కలి' బయటకు వచ్చేశాడు. కలిని చూసేటప్పటికి నలుడు ఆగ్రహోదగ్రుడై పోయాడు. అంతేకాదు కలికి శాపాన్నిద్దామని తలంచాడు కూడా. 'కలి' బయటకు రాగానే రెండు చేతులను జోడించి భయకంపితుడౌతూ "తాము తమకోపాన్ని శాంతింపజేయండి. మిమ్మలను నేను యశస్విని చేస్తాను. మీరు దమయంతిని వదలి వెళ్ళిన సమయంలో ఆమెచే నేను శపింపబడ్డాను. నేను మిక్కిలి దుఃఖంతో కర్కోటక సర్పవిషంతో మీ శరీరంలో ఉంటూ కాలిపోతూ వచ్చాను. నేను మీ శరణు కోరుతున్నాను. నా ప్రార్థన విని నన్ను శపించకండి. మీ పవిత్ర చరిత్రను గానం చేసిన వారికి నా వలన భయం వుండకుండుగాక" అన్నాడు.

నల మహారాజు కోపాన్ని శాంతింపజేసుకున్నాడు. కలి భయభీతుడై తాండ్రకాయ చెట్టులో ప్రవేశించాడు. కలి – నల సంభాషణ వారిద్దరికే తప్ప మరొకరికి తెలియలేదు. ఆ చెట్టేమో మోడుగా మారి పోయింది.*

ఈ విధంగా నలమహారాజును కలి వెంబడించే పీడపోయింది.

---

* యే చ త్వాం మనుజాలోకే కీర్తయిష్యన్త్య తన్ద్రితః
మత్ప్రసూతం భయంతేషాం న కదాచిద్ భవిష్యతి
భయార్తం శరణం యాతం యది మాం త్వం న శప్స్యసే
ఏవముక్తోనలో రాజా న్యయచ్ఛత్ కోపమాత్మనః
తతో భీతః కలిః క్షిప్రం ప్రవివేశబిభీతకమ్
కలిస్త్వన్యైస్తదాదృశ్యః కథయన్ నైషధేన వై (మహా.భార.వన.72/36–38)

అయినా ఆయన రూపం మారలేదు. ఆయన తన రథాన్ని శీఘ్రంగా నడిపింపగా సాయంకాలం అవుతూ వుండగా వారు విదర్భ దేశం చేరారు. వీరు వచ్చిన వార్తను తెలిసి భీమరాజు ఋతుపర్ణుని తమ వద్దకు రావలసిందిగా కబురు పెట్టాడు. ఋతుపర్ణుని రథఘోషకు దిక్కులు పిక్కటిల్లాయి. కుండిన నగరంలో నలరాజు గుఱ్ఱాలు అవికూడా అతని పిల్లలను తీసుకువచ్చినప్పటివి ఉండిపోయినవి. రథ శబ్దాలను విన్న ఆ గుఱ్ఱాలు వచ్చినది నలుడన్న సంగతిని పసికట్టాయి. అప్పుడవి పూర్వము వలె ఎంతో సంతసించినవి. దమయంతికి కూడా ఆ రథశబ్దాలు విన్నప్పుడలాగే అనిపించింది. అదివిని దమయంతి యిటులన్నది – 'ఈ రథ చక్రాల సవ్వడి నా మదిలో ఉల్లాసమును కలిగించుచున్నది. అవశ్యం, ఆ రథసారథి నా పతిదేవుడే అయివుంటాడు. ఆయన నేడు నావద్దకు చేరకపోతే నేను జ్వలించే అగ్నిలో దూకుతాను. నేను సరదాగా నవ్వులాటగా కూడా ఆయనతో అసత్యమాడినట్లుగా, ఆయనకు ఏదేని అపకారము తలపెట్టినట్లుగా, ప్రతినబూని తప్పినట్లుగా జ్ఞప్తికి రావడములేదు. ఆయన శక్తిమంతుడు. క్షమాసహితుడు. వీరుడు, దాత, ఏకపత్నీవ్రతుడు. ఆయన వియోగంలో నా హృదయం పగిలిపోతుంది.' ఈ విధంగా అనుకుని దమయంతి భవనం కప్పు దగ్గర నిలబడి రథంలో వచ్చినవారిని, సారథిని, రథం నుంచి దిగడం చూడసాగింది.

★ ★ ★

# దమయంతి నలుని పరీక్షించుట

## గుర్తుపట్టుట - కలియుట
## రాజ్యప్రాప్తి - ఉపసంహారము

బృహదశ్వులు చెబుతున్నారు – 'యుధిష్ఠిరుడా! విదర్భ నరేంద్రుడైన భీముడు, అయోధ్యా నరేంద్రుడైన ఋతుపర్ణునికి చక్కని స్వాగతసత్కారాలు చేయించాడు. ఆయనకు చక్కని విడిదిని ఏర్పాటు చేయించాడు. ఋతుపర్ణునికి స్వయంవరపు ఏర్పాట్లేమీ కనిపించలేదు. నా పుత్రిక స్వయంవరము కొరకై ఋతుపర్ణుడు వచ్చాడని భీమునికి తెలియనే తెలియదు. కుశల ప్రశ్నల పిదప భీముడు ఋతుపర్ణునితో "మీరు ఏమి పని మీద ఇలా వచ్చారు?" అని అడిగాడు. స్వయంవర సంరంభాలు ఏమాత్రము కనిపించకపోవడం వల్ల – "ఏమీ లేదు, నేను మిమ్మల్ని చూచి – నమస్కరించి వెడదామని" వచ్చానన్నాడు. భీముడు "వందయోజనాల దూరం ప్రయాణం చేసి కేవలం నన్ను చూడడానికని వస్తాడా! సరేలే ముందు ముందు సంగతి ఏమిటో తెలుస్తుంది కదా!" అనుకున్నాడు. భీముడు ఘనసత్కారాలు చేసి ఋతుపర్ణుని తనవద్దనే నిలిపి ఉంచాడు. బాహుకుడు కూడా వార్ష్ణేయునితో అశ్వశాలలోనే ఉండిపోయి అశ్వసేవలలో లగ్నమైపోయాడు.'

దమయంతి రథ సవ్వడిని బట్టి కలత చెంది ఇట్లు ఆలోచించ సాగింది – చూస్తే నా పతిదేవుని రథంలాగే అనిపించుచున్నది. కానీ ఎక్కడా ఆయన దర్శనమే కాలేదేమిటీ అనుకున్నది. ఒకవేళ వార్ష్ణేయుడు నలునివద్ద రథగమన విద్యను నేర్చుకొనుట వలన ఆతని రథము వలెనే అనిపించిందేమో లేదా ఋతుపర్ణునకు కూడా ఈ విద్య తెలిసి యుండవచ్చును కదా!" అని పరిపరి విధాలుగా భావించి దమయంతి తన దాసిని పిలిపించి ఇట్లు చెప్పింది –

"కేశినీ! నువ్వు వెళ్ళి ఆ కురూపి పురుషుడెవ్వరో కనుక్కొనిరా!

బహూశా ఆయనే నా పతిదేవుడేమో! నేను బ్రాహ్మణుల ద్వారా ఏ సందేశవాక్యాలు పంపినానో, అవే సందేశ వాక్యాలు ఆ కురూప పురుషునివద్ద చెప్పి, ఆయన ప్రత్యుత్తరమును వినినాతో చెప్పవలసినదని పంపించింది. కేశిని వెళ్ళి బాహుకునితో మాట్లాడింది. తమ రాజు వచ్చిన కారణమును చెప్పతూ బాహుకుడు, అశ్వవిద్యలో పాకశాస్త్రంలో తనకుగల ప్రావీణ్యమును గూర్చి పరిచయం చేశాడు."



కేశిని బాహుకునితో "బాహుకా! నలరాజెక్కడ వున్నారు? మీకు ఆయన గురించి తెలుసునా? లేదా నీ స్నేహితుడు వార్ష్ణేయునికి తెలుసునా?" అని అడిగింది.

బాహుకుడు – "కేశినీ! వార్ష్ణేయుడు రాజగు నలుని పిల్లలను ఇక్కడ వదలి వెళ్ళినాడు. నలునకు సంబంధించిన సంగతులేమీ తెలియవు. నలుని రూపము ప్రస్తుతము మారిపోయింది. ఆయన అజ్ఞాతంగా ఉంటున్నాడు. ఆయనెవరో ఆయనకే తెలుస్తుంది. లేదా ఆయన ధర్మపత్ని దమయంతికి తెలుస్తుంది. ఆయన తన గుప్త చిహ్నములను మరొకరి ముందర ప్రకటించుటకు సమ్మతింపడు. కేశినీ! నలరాజు కష్టాల్లో చిక్కుకొనెను. అందువల్లనే ఆయన తన పత్నిని వదిలివెళ్ళాడు. దమయంతికి తన భర్తపై కోపం వుండకూడదు. భోజనం గురించి ఆయన ఆలోచిస్తున్న సందర్భంలో పక్షులు ఆయన వస్త్రాన్ని తీసుకొని వెళ్ళినవి. ఆయన హృదయం ఎంతగానో బాధపడింది. నలరాజు తన భార్యపట్ల సరిగా వ్యవహరించలేదను మాట మాత్రం నిజం. అయినప్పటికీ నలుని దురవస్థకు దమయంతి ఆయనపట్ల విచారించి, కోపగించ వలదు." ఈ విధంగా చెప్పుతున్నప్పుడు నలుని హృదయం ఖిన్నమైపోయింది. కళ్ళనుండి అశ్రువులు జారాయి. ఆయన ఏడ్వసాగాడు. కేశిని దమయంతి వద్దకు వెళ్ళి బాహుకుని వద్ద జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది. ఆయన ఏడ్చిన సంగతి కూడా వివరించింది.

అతడే నలుడేమోననే శంక దమయంతికి మరింతగా దృఢపడింది. ఆమె దాసితో అందిగదా 'కేశినీ! నీవు మళ్ళీ బాహుకుని వద్దకు వెళ్ళు. ఏమీ మాట్లాడకుండా నిలబడి ఆయన చేసే చేష్టలపై దృష్టిపెట్టు నిప్పుకావాలి అంటే ఇవ్వకు. నీళ్ళు కావాలంటే ఆలస్యంగా ఇవ్వాలి. అతని ఒక్కొక్క చర్యను నీవు వచ్చి నాకు చెబుతూ ఉండాలి.' – కేశిని మళ్ళీ బాహుకుని వద్దకు వెళ్ళింది. అక్కడామె చూచిన ఆశ్చర్యకరమగు విషయాలు చెప్పడానికి తిరిగి దమయంతి చెంతకు వచ్చి, రాజకుమారీ! బాహుకుడు నీరు, నిప్పు, భూమిపై

అన్ని విధాలుగా విజయాలను సాధించినవాడు. ఆయనవంటి గొప్ప వ్యక్తిని నేనెక్కడా చూడలేదు, వినలేదుకూడా. ఆయనను చూచి క్రిందుగానున్న ద్వారమే పెద్దదైపోతోంది. వంగకుండానే ఆయన వెడుతున్నారు. చాలా ఆశ్చర్యంగా ఉంది. చిన్న చిన్న కన్నాలు కూడా ఆయనను చూచి గుహల్లా అయిపోతున్నాయి. నీళ్ళ గురించి పెట్టిన కడవలు ఆయన దృష్టి పడగానే నిండిపోతున్నవి. ఆయన గడ్డి పువ్వులను తీసుకుని సూర్యుని ముందు పెడితే చాలు, అవి వెలిగిపోతున్నాయి. ఇంకా అబ్బురమైన సంగతేమంటే ఆయన అగ్నిని స్పృశిస్తే కాలడం లేదు. ఆయన ఇష్టానుగుణంగా నీళ్ళు ప్రవహిస్తున్నాయి. ఆయన తన చేతులతో పువ్వులను నలిపివేస్తే అవి వాడిపోవడం లేదు సరికదా మరింతగా వికసించి పరిమళాలు వెదజల్లుతున్నాయి. ఈ అద్భుత లక్షణాలను చూచి నేను బిత్తరపోయి త్వరితంగా మీ వద్దకు వచ్చేశాను." అని అతని చర్యలను వివరించి చెప్పింది. బాహుకుని పనులు, చేష్టలూ అన్నిటినీ గ్రహించినదై దమయంతి బాహుకుడే తన పతిదైవమయి వుంటాడని నిశ్చయించుకొంది. ఆమె తన ఇద్దరు బిడ్డలను కేశినితో పాటు బాహుకుని వద్దకు పంపించింది. ఇంద్రసేనక, ఇంద్రసేన లిద్దరినీ దూరం నుండి చూడగానే బాహుకుడు వారిని గుర్తించి దగ్గరకు వెళ్ళి, వారిద్దరినీ హృదయానికి హత్తుకుని ఒడిలో కూర్చో పెట్టుకున్నాడు. బాహుకుడు తన బిడ్డల్ని కలిసి చలించిపోయి ఏడువసాగాడు. అతనిముఖంపైన తండ్రికి తగిన ప్రేమ భావము తొణికిస లాడుచుండెను. తదనంతరం బాహుకుడు ఇద్దరు పిల్లల్ని కేశినికి ఇచ్చి "ఈ ఇద్దరు పిల్లలూ నా పిల్లలతో సమానంగా వున్నారు. అందువల్లనే వీరిని చూచి ఏడ్చాను. కేశినీ! నీవు మళ్ళీ మళ్ళీ నావద్దకు వస్తూంటే ప్రజలేమనుకుంటారో నీకు తెలియదు. అందువల్ల నావద్దకు మాటికి మాటికి వస్తూండడం మంచిది కాదు. నీవు వెళ్ళుము" అన్నాడు. కేశిని దమయంతి వద్దకు వచ్చి అక్కడ జరిగిన విషయాలన్నీ చెప్పింది.



దమయంతి కేశినిని తమ తల్లివద్దకు ఇలా చెప్పి పంపింది. "మాతా! బాహుకుదు నలుడోకాదో యని పరీక్షించాను. మళ్ళీ మళ్ళీ పరీక్షించిన మీదట ఆయన రూప విషయంలో తప్ప తక్కిన వానిలో తేడా ఏమీ లేదు. ఇప్పుడు నేనుగా స్వయంగా ఆయనను పరీక్షించాలనుకుంటున్నాను. ఇందువల్ల మీరు బాహుకుని నా మందిరానికి రావలసిందిగా ఆజ్ఞాపించండి. లేదా వారి వద్దకు వెళ్ళడానికి నాకు అనుజ్ఞనివ్వండి. ఈ సంగతి

మీరు చెప్పాలంటే నాన్నగారికి చెప్పండి. లేదా మానేయండి." రాణి తన భర్తకు విషయమును తెలిపి, ఆయన అనుమతి గైకొని బాహుకుని అంతఃపురానికి రావలసినదిగా ఆజ్ఞాపించింది. బాహుకుడు పిలిపించ బడ్డాడు. దమయంతిని చూస్తూనే నలుని హృదయం శోకంతో దుఃఖంతో నిండిపోయింది. ఆయన కన్నీళ్ళల్లో స్నానమాడినట్లయింది. బాహుకుని వ్యాకులత చూచి దమయంతి కూడా శోకగ్రస్తురాలైంది. అప్పుడు ఆమె కాషాయ రంగుచీర కట్టుకుని వుంది. జుట్టు ముడి వేసుకొని వుంది. శరీరం శుభ్రంగా లేదు. దమయంతి చెప్పసాగింది. "బాహుకా! లోగడ ధర్మజ్ఞుడైన ఒక పురుషుడు తన భార్యను అరణ్యంలో నిద్రిస్తున్న వేళ వదలివేసి వెళ్ళిపోయాడు. మీరుగాని ఆయనను ఎక్కడైనా చూశారా? అలసి సొలసి, నిద్రలో అచేతనంగా ఉన్న నిరపరాధియగు ఆ స్త్రీని పుణ్యశ్లోకుడగు నిషధ* నరేంద్రుడు తప్ప మరొకరు ఎవ్వరు వదలగలరు? నేను నాకు తెలిసినంతవరకూ జీవితంలో ఎప్పుడూ ఆయనపట్ల వీసమెత్తు అపరాధము చేయలేదు. అయినప్పటికీ వారు నన్ను అరణ్యంలో వదలి వేసి వెళ్ళారు" ఈ విధంగా చెబుతున్నప్పుడు దమయంతి నేత్రాలనుండి కన్నీటి చుక్కలు కట్టలు త్రెంచుకొని రావడం చూచి నలుడు గుప్తంగా ఉండలేకపోయాడు. ఆయన చెప్పాడుగదా "ప్రియురాలా! నేను తెలిసే రాజ్యాన్ని నాశనం చేశానా? తెలిసే నిన్ను వదిలి వెళ్ళానా? ఇదంతా కలి కారణంగా జరిగింది. నా నుండి దూరమయినప్పటినుండి దివారాత్రులు నా గురించే నీవు స్మరిస్తూవుంటావనీ నాకు తెలుసు కలి నా శరీరంలో ఉంటూ నీ శాపకారణంగా తపిస్తూ వుండేవాడు. నేను కష్టపడి, తపోబలం కారణంగా కలిపై విజయాన్ని సాధించాను. ఇప్పుడు మన దుఃఖాలు అన్నీ అంతమైపోయే రోజులు వచ్చాయి. 'కలి' ఇప్పుడు నన్ను వదిలి వెళ్ళాడు. నేను నీ గురించి మాత్రమే ఇక్కడకు వచ్చివున్నాను. అవునుగానీ, ఒక విషయం చెప్పు. ప్రేమించేవాడు,

---

* మమ రాజ్యం ప్రణష్టం యన్నాహం తత్ కృతవాన్ స్వయమ్।
కలినా తత్కృతం భీరు! యచ్చ త్వామహమత్యజమ్॥ (మహా.వన.76-17)

అనుకూలమైనవాడు అయిన భర్తను నేనుండగా ఏవిధంగా నీవు మరో భర్తను వివాహమాడటానికి తయారయ్యావు? ఇంకో స్త్రీ ఎవరైనా ఈ విధంగా చేయగలదా?* నీ స్వయంవర వార్త విని ఋతుపర్ణ మహారాజు బహువేగంగా ఇక్కడికి వచ్చాడు."

దమయంతి చేతులు జోడించి ఈ విధంగా చెప్పసాగింది, "ఆర్య పుత్రా! నాపై దోషాన్ని ఆరోపించడం ఉచితంకాదు. ఎదురుగా కనబడిన దేవతలను ససేమిరా వద్దని మిమ్మల్ని నేను వరించానని మీకు తెలియునుకదా! నేను చాలా మంది బ్రాహ్మణులను నాల్గువైపులకు, మిమ్మల్ని వెదకడానికై పంపాను. నా మాటలనే చెబుతూ వారు నలువైపుల తిరుగుచుండిరి. పర్ణాదుడను బ్రాహ్మణుడు అయోధ్యానగరంలో గల మీ వద్దకు చేరుకొనెను. అతడు మీకు నా మాటలనే వినిపించినాడు. అప్పుడు మీరు కూడా దానికి తగిన విధంగా స్పందించి యథోచితంగా జవాబిచ్చారు. నేను ఆ సమాచారాన్ని విన్న తర్వాతే మిమ్మల్ని పిలిపించడానికే ఈ ఉపాయం పన్నాను. నాకు తెలుసు మీరు తప్ప మరొకరెవ్వరూ గుఱ్ఱాల రథంపై ఒక్కదినంలో శతయోజనాల దూరాన్ని చేరలేరు. నేను మీ పాదాలను తాకుతూ శపథ పూర్వకంగా చెబుతున్నాను. సత్యమే, సత్యమే చెబుతున్నాను. నేనెప్పుడూ మనస్సులో కూడా పరపురుష చింతన, చేయనేలేదు. ఒకవేళ నేనెప్పుడైనా మానసికంగానైనా పాపకర్మను చేసి వుంటే – నిరంతరం భూమిపై సంచరించే వాయుదేవుడు – సూర్యభగవానుడు, మనోదేవత చంద్రుడూ నా ప్రాణాలను తీయుదురుగాక! ఈ చెప్పిన ముగ్గురు దేవతలూ సకల భూమండలంపై సంచరిస్తూ ఉంటారు కదా! వారు సత్యాన్నే ప్రకటిస్తారు. ఒకవేళ నేను పాపినైతే నన్ను

---

* కథం ను నారీ భర్తారమనురక్తమనువ్రతమ్
ఉత్సృజ్య వరయేదన్యం యథా త్వం భీరు! కర్హిచిత్ (మహా.వన.76–22)



వదిలేయండి" ఆ సమయానికి వాయుదేవుడు అంతరిక్షంలో నుండి* "రాజా! దమయంతి ఏ పాపమూ చేయలేదని సత్యప్రమాణంగా

---

* ఏవముక్తస్తథా వాయురన్తరిక్షాదభాషత
నైషా కృతవతీ పాపం నల! సత్యం బ్రవీమి తే
రాజన్ శీలనిధిః స్ఫీతో దమయన్త్యా సురక్షితః
సాక్షిణో రక్షిణశ్చాస్యా వయం త్రీన్ పరివత్సరాన్ (మహా.వన.76–36,37)

వచించుచున్నాను. ఆమె మూడు సంవత్సరాల వరకూ తన ఉజ్జ్వల శీలవ్రతాన్ని రక్షించుకుంది. మేము ఈమెకు రక్షకులమై నిలిచాము అంతేగాదు ఈమె పవిత్రతకు సాక్షులము అన్నాడు. ఇంకా ఇలా అన్నాడు. నిన్ను వెదకడంలో భాగంగానే రెండవ స్వయంవరం ప్రకటించిందే గాని మరొకటేమీ కాదు. నిజానికి నీకు దమయంతి యోగ్యురాలు; దమయంతికీ నీవు యోగ్యుడవు. శంకారహితుడవై దమయంతిని స్వీకరించుము" అని పవన దేవుడీ విధంగా అంటున్న సమయంలో ఆకాశంలో పుష్పవర్షం కురవసాగింది. దేవతల దుందుభులు మ్రోగసాగాయి. శీతల, మంద సుగంధ వాయువులు వీచసాగాయి. ఈ అద్భుత దృశ్యాన్ని చూచిన నలుడు తన సందేహాన్ని పటాపంచలు చేసుకున్నాడు; నాగరాజు కర్కోటకునిచే తన కివ్వబడిన వస్త్రమును పైన ధరించి నాగరాజుని స్మరించాడు. వెంటనే నలునికి పూర్వ స్వరూపం వచ్చేసింది. నలుణ్ణి పూర్వరూపంలో చూచిన దమయంతి ఆయనను కౌగిలించుకుని ఏడ్వసాగింది. నలరాజు కూడా దమయంతిని ప్రేమతో సంభావించాడు. ఇద్దరు పిల్లలను హృదయానికి హత్తుకున్నాడు. వారితో ప్రేమ పూర్వకంగా మాటలాడసాగాడు. ఆ రాత్రి అంతా దమయంతితో సంభాషించడంలోనే గడిచిపోయింది.

ప్రాతఃకాలమయ్యాక స్నానాదులు నిర్వర్తించుకుని అందమైన బట్టలు కట్టుకుని నలదమయంతులు భీముని వద్దకు వెళ్ళి పాదాలకు నమస్కరించారు. భీముడు చాలా ఆనందించినవాడై వారిరువురినీ సత్కరించి ఆశ్వాసించెను. నలదమయంతుల సంగతులు ఆనోటా ఈనోట అన్నిచోట్ల వ్యాపించినవి. నగరంలోని నర నారీమణులు ఆనందంలో మునిగి ఉత్సవం చేసుకున్నారు. దేవతల పూజలను నిర్వర్తించారు. ఋతుపర్ణ రాజు బాహుకుడే నలుడన్న సంగతి, తక్కిన సంగతులూ గ్రహించి నలుణ్ణి తన వద్దకు పిలిపించి తనను క్షమించమని కోరెను. అప్పుడు నలుడు ఋతుపర్ణుని ఉత్తమ వ్యవహారమును ప్రశంసించి, అతనిని సత్కరించెను. దానితోపాటు అశ్వవిద్యకూడా నేర్పాడు. ఋతుపర్ణరాజు ఇంకొక సారథిని తీసుకుని తన నగరానికి వెళ్ళిపోయాడు.



నలమహారాజు ఒక నెలరోజుల వరకూ కుండిన నగరంలోనే ఉన్నాడు. తదనంతరం తన మామ భీముని ఆజ్ఞగైకొని కొద్దిమందిని వెంటనిడుకొని నిషధదేశానికి ప్రయాణమయ్యాడు. భీమరాజు ఒక తెల్లని రంగుగల రథాన్ని, పదహారుగజాలను, యాభై గుఱ్ఱాలను, ఆరు వందల సైనికులను నలరాజుతో పంపాడు. నలుడు తన నగరాన్ని ప్రవేశించాక పుష్కరుని కలిసి "నీవప్పుడు కపట భరితమైన ద్యూతం ఆడావు.

మళ్ళీ ఇప్పుడు నాతో ఆడుము. లేదా విల్లెక్కు పెట్టిరమ్ము" అన్నాడు. పుష్కరుడు నవ్వి "మంచి మాటే, అలాగే ఆడుదాం. నీకు ద్యూతంలో కాయడానికి మళ్ళీ ధనం వచ్చిందన్నమాట. అయితే ఈసారి నేను నీ ధనాన్నే కాదు, నీ దమయంతిని కూడా గెలుచుకుంటాను." అన్నాడు భీకరంగా. నలుడు అన్నాడుగదా "మాటలెందుకు సోదరా ద్యూతమాడుము. వట్టి మాటలెందుకు? పందెముగా ఓడిస్తే నీ దశ ఎలా ఉంటుందో చూద్దువుగాని నీకే తెలిసి వస్తుంది." –

ద్యూతం ఆరంభమయింది. ఆటలో మొదటి పందెములోనే నలుడు పుష్కరుని రాజ్యాన్ని, రత్న భాండాగారాన్ని, చివరకు అతని ప్రాణాల్ని గెలిచాడు. నలుడు పుష్కరునితో "ఇప్పుడు నీ రాజ్యమంతా నా హస్తగతమైంది. ఈ దుర్దశలో నీవు దమయంతి వైపు కన్నెత్తి కూడా చూడలేవు. నీవు దమయంతికి సేవకుడవుతావు. ఓరీ మూఢుడా! మొదటిసారి నాతో నీవు ద్యూతమాడినప్పుడు నీవు నన్ను గెలవలేవు. ఆ గెలిచినది కలిపురుషుడు మాత్రమే. నీకీ సంగతి కూడా తెలియదు. ఆ 'కలిపురుషుడు' చేసిన దోషాలను నీ శిరస్సు మీద రుద్దను. అలా రుద్దాలని అనుకోవడంలేదు. నీవు నీ జీవితాన్ని సుఖంగా గడుపు. నేను నిన్ను వదిలి వేస్తున్నాను. నీ మీద నాకు ప్రేమభావము పూర్వము వలెనే, ఇప్పుడు కూడా ఉండగలదు. నీవు నా సోదరుడవు. నాకు నీపట్ల కుటిల దృష్టిలేదు. నీవు శతాయుష్మంతుడవై జీవించుము." అన్నాడు. నలుడీవిధంగా పుష్కరునికి ధైర్యాన్నిచ్చి, హృదయమునకు హత్తుకొని పోవుటకు అనుమతించెను. పుష్కరుడు రెండు చేతులూ జోడించి "మీకు ప్రపంచంలో అక్షయకీర్తి లభిస్తుంది. అంతేకాదు మీరు పదివేల సంవత్సరాల వరకూ సుఖంగా జీవిస్తారు. మీరు నాకు అన్నదాతలు, ప్రాణదాతలు," అన్నాడు. పుష్కరుడు సత్కార సమ్మాన పూర్వకంగా ఒక నెలరోజుల పాటు నలుని నగరంలోనే నివసించాడు. తరువాత తన సైన్యం, సేవకులు, కుటుంబీకులతో తన నగరానికి వెళ్ళిపోయాడు. నలమహారాజు తిరిగి వచ్చినందుకు ప్రజలంతా ఎంతగానో ఆనందించారు. ప్రజలెల్లరి ముఖాలూ ఆనందంతో వికసించాయి.



నాగరికులు, సాధారణ ప్రజలు, మంత్రిమండలి సభ్యులు పులకించిపో యారు. వారు చేతులు జోడించి "రాజేంద్రా! ఇప్పుడు మేము దుఃఖ నివృత్తిని, సుఖమును పొందినాము. ఆ విధంగా మిమ్మల్ని మేము కొలిచెదము. మేమంతా మీ సేవాభిలాషులం" అన్నారు.

రాజ్యంలో ఇంటింటా పండుగలా ఆనందంగా గడుపుకున్నారు. నలుదిశలా శాంతి వ్యాపించింది. పెద్ద పెద్ద ఉత్సవాలు జరిగాయి.

నలమహారాజు సైన్యాన్ని పంపించి దమయంతిని పిలిపించాడు. భీమరాజు తన కుమార్తెను ఎన్నో వస్తువులిస్తూ సారెపెట్టి మెట్టినింటికి పంపించాడు. దమయంతి తన ఇద్దరు పిల్లల్ని తీసుకుని నలుని వద్దకు వెళ్ళి తనమందిరాన్ని చేరింది. నలమహారాజు అధికమైన ఆనందంతో కాలం వెళ్ళబుచ్చసాగాడు. ఆయన ఖ్యాతి దూర దూరాలకు సైతం వ్యాపించింది. ధర్మబుద్ధితో నలుడు తన రాజ్యాన్ని పాలించసాగాడు. గొప్ప గొప్ప యజ్ఞాలు చేస్తూ భగవదారాధన చేశాడు.

బృహదశ్వుల వారు చెబుతున్నారు "యుధిష్ఠిరుడా! నీవు కూడా కొన్ని రోజుల్లో నీ రాజ్యాన్ని, నీ సంబంధులను పొందగలుగుతావు. నలుడు ద్యూతం ఆడడం ద్వారా దుఃఖానికి మూల్యం చెల్లించాడు. ధర్మరాజా! పాపం నలుడొక్కడే సర్వదుఃఖాలను అనుభవించవలసి వచ్చింది. కానీ నీ దుఃఖాలను పంచుకోవడానికి నీతోపాటుగా నీ సోదరులున్నారు. నీ భార్య ద్రౌపది వున్నది, విద్వాంసులు, సదాచారులూ అయిన బ్రాహ్మణులున్నారు. ఇటువంటి దశలో శోకించడానికి నీకే కారణములేదు. ప్రపంచంలో స్థితిగతులు ఎల్లవేళలా ఒకే విధంగా ఉండవు. ఈ సంగతి దృష్టిలో పెట్టుకుని పురోగతిని, తిరోగతిని గూర్చి చింతించ వలదు. నాగరాజు కర్కోటకుడు, దమయంతి, నలుడు మరియు ఋతుపర్ణుడు – వీరికి సంబంధించిన ఈ కథను ఎవ్వరు చెప్పినా, విన్నా వారి కలియుగ పాపాలు నశించిపోతాయి. అంతేకాదు దుఃఖించే వారికి ధైర్యం లభిస్తుంది."

- మంగళం మహత్ -

# సూక్తులు

1. విశిష్టాయయా విశిష్టేన సంగమో గుణవాన్ భవేత్!(మహా.వన.53-31)

విశిష్టమైన స్త్రీకి విశిష్టమైన పురుషునితో సంయోగం జరిగితే ఫలగుణం ఇబ్బడి ముబ్బడిగా ఉంటుంది.

2. నాస్తి భార్యాసమం మిత్రం నరస్యార్తస్య భేషజమ్. (61-30)

దుఃఖంలో నున్న మనుష్యునికి భార్యవంటి మిత్రముకాని ఔషధముకాని మరొకటి లేదు.

3. నాకాలే విహితో మృత్యుర్మర్త్యానామ్. (63-7)

మనుష్యులకు మృత్యువు అకాలంలో సంభవించదు.

4. చత్వారో ఏకతోవేదాః సాంగోపాంగాః సవిస్తరాః
స్వధీతామనుజవ్యాఘ్ర సత్యమేకం కిలైకతః (64-17)

సాంగోపాంగంగా విస్తరించిన నాల్గువేదాల స్వాధ్యాయస్థితి ఒకవైపు ఉంటే - రెండవ వైపు సత్యభాషణం ఉంటే రెండవ వైపు ఉన్నదే మొదటిదాని కంటె అధికమైనది.

5. నా ప్రాప్తకాలో మ్రియతే

ఏ మనుష్యులకయితే మృత్యువు వచ్చే సమయం ఆసన్నముకాలేదో, అట్టివారికి వారు కోరుకున్నప్పటికీ మరణం సంభవించదు.

6. నహ్యదైవకృతం కించిన్నరాణామిహవిద్యతే. (65-40)

ఈ ప్రపంచంలోని మనుష్యులకందరికీ - సుఖంగాని, దుఃఖంగాని దైవమువలననే లభిస్తుంది.

7. సర్వః సర్వం న జానాతి సర్వజ్ఞో నాస్తి కశ్చన!
నైకత్ర పరినిష్ఠాస్తి జ్ఞానస్య పురుషే క్వచిత్ (72-8)

అందఱికీ అన్నీ తెలియవు. ఈ ప్రపంచంలో సర్వజ్ఞుడు ఎవ్వడూకాడు. ఏ పురుషునిలోనూ సంపూర్ణమైన జ్ఞానం ప్రతిష్ఠింపబడి వుండదు.

8. భర్తా నామ పరం నార్యా
భూషణం భూషణైర్వినా (68–19)

స్త్రీలకు భర్తను మించిన భూషణమే లేదు. భూషణ రహితంగా ఉన్నా, భర్త అనే భూషణంతో ప్రకాశించవచ్చును.

9. వైషమ్యేపి సంప్రాప్తా గోపాయన్తి కులస్త్రియః
ఆత్మాన మాత్మనా సత్యో జితః స్వర్గో న సంశయః(70–8;74–25)

ఉత్తమ కులస్త్రీలు ఎంతో పెద్ద కష్టాలు పడినప్పటికీ వారు వారిని స్వయంగా రక్షించుకుంటారు. ఇటువంటి వారికి సత్య విజయం, స్వర్గ విజయం రెండూ లభిస్తాయి. ఇందులో సంశయం లేదు.

10. రహితా భర్తృభిశ్చాపి న క్రుధ్యన్తికదాచన!
ప్రాణాంశ్చారిత్రకవచాన్ ధారయన్తి వరస్త్రియః. (70–9;74–26)

ఉత్తమ స్త్రీలు తమ భర్తల ఎడబాటు జరిగినప్పటికీ వారిని కోపగించరు. వారెప్పుడూ సదాచార కవచధారులై ప్రాణాలను ధరిస్తూంటారు.

11. అస్థిరత్వం చ సంచిత్య పురుషార్థస్య నిత్యదా!
తస్యోదయే వ్యయే చాపి న చింతయితుమర్హసి. (79–12)

పురుషునికి ప్రాప్తమయ్యే అన్ని విషయాలూ ఎప్పుడూ అస్థిరంగానూ వినాశనశీలం కలిగినవి గానూ ఉంటాయి. దీనిని ఆలోచించి, ప్రాప్తాప్రాప్తములకు కించిత్తయినా చింతించకుండా వుంటే మేలు.

12. విషమావస్థితే దైవే పౌరుషేఽఫలతాం గతే
విషాదయన్తి నాత్మానం సత్త్వోపాశ్రయిణోనరాః.

దైవం ప్రారబ్ధం ప్రతికూలించి, పురుష ప్రయత్నం నిష్ఫలమయిన ప్పుడు ఆ సమయంలో కూడా, సత్త్వ గుణాన్ని ఆశ్రయించే మనుష్యునికి మనస్సు నందు విషాదం ఉండబోదు.

– ఓం తత్సత్ –

॥ శ్రీ హరిః ॥

# త్రయోదశ సూత్రావళి

1. యజ్ఞోపవీతధారులగు ద్విజులెల్లరు కనీసము దినమునకు రెండు మార్లు – ఉదయం, సాయం సంధ్యావందనమును సరియగు వేళకు చేయవలెను. సమయమునకు విత్తిన విత్తనము ఎక్కువ ఫలించినట్లుగా, వేళకుచేసిన సంధ్య మిక్కిలి లాభదాయకమగునని మరవవద్దు. సరియైన సమయమునకు సంధ్యావందనము చేయు పురుషుని ధర్మతేజస్సు మహర్షి జరత్కారునివలె వృద్ధినొందగలదు.

2. వేద, శాస్త్రములందు గాయత్రీమంత్రముతో సరిసమానమగు వేరొక మంత్రము ఏదియూ తెలుపబడలేదు. కావున శుచియై, ఒక పవిత్ర స్థలమందు కూర్చుని వీలునుబట్టి అధిక సంఖ్యలో గాయత్రీమంత్రమును జపింపవలెను. ఉదయం, సాయంకాలం, రెండు వేళలలో కనీసము ఒకమాల (108 మార్లు) తప్పక జపింపవలయును.

3. హరేరామ హరేరామ రామరామహరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

అను షోడశనామ మంత్రమును జాతి, కుల భేదము లేకుండా స్త్రీ, పురుషులందరు చేయవచ్చును. అమోఘమగు ఈ మంత్ర మహిమ కలిసంతరణోపనిషత్తులో విపులముగ వర్ణింపబడినది. సార్ధత్రికోటి (మూడు కోట్ల ఏబది లక్షలు) సంఖ్యగా ఈ మంత్రము జపించినవారికి భగవత్ప్రాప్తి కలుగుననుటలో సందియములేదు.

4. శ్రీమద్భగవద్గీతను అందరు పారాయణము, అధ్యయనము చేయవలెను. అర్థము తెలియకుండా గీతా పారాయణము చేసినను గొప్పలాభము చేకూరును. కాని అర్థము తెలియకుండా పూర్తి

గీతను పారాయణము చేయుటకంటే, అర్థ సహితముగా ఒక అధ్యాయమును పారాయణము చేయుట ఎంతో శ్రేష్ఠమైనది. అందుచేత ప్రతి వ్యక్తి అర్థసహితముగ గీతలోని ఒక అధ్యాయమును, ప్రతి దినము తప్పక పఠింపవలయును.

5. ప్రతి మనిషి తన ఇంటిలో తమ, తమ భావము ననుసరించి భగవంతుని విగ్రహమును పెట్టుకొని మిక్కిలి ప్రేమతో ప్రతిదినము పూజించవలెను. దీనితో భగవంతుని యందు శ్రద్ధా, విశ్వాసము, ప్రేమ పెంపొందుటయేగాక, శుభ సంస్కారము లేర్పడును. సమయము సద్వినియోగమగును.

6. ప్రతి దినము [గీతా 6వ, అధ్యాయములోని 10 నుండి 13 వరకు గల శ్లోకముల ననుసరించి] ఏకాంతముగా కూర్చొని, కనీసము ఒక గంటకాలము తమ అభీష్టానుసారము సాకార లేదా నిరాకార భగవంతుని ధ్యానించుటకు యత్నింపవలెను. తద్వారా పాపము, విక్షేపము సమూలముగా నశించిపోవును. ఉద్ధరింపబడుటకు ఔన్నత్యము లభించును.

7. గృహస్థాశ్రమములో నిత్యము జరుగు పాపములను నశింప చేయుటకు ఏర్పడిన పంచమహాయజ్ఞములలో ఒకటి బలివైశ్వదేవము. గృహస్థుడైన ప్రతివ్యక్తి, ప్రతిదినము బలివైశ్వదేవము చేసి, భుజింపవలెను.

8. మానవుడు అన్నివేళలా భగవన్నామమును, తత్ స్వరూపమును స్మరింపుచునే తన ధర్మముననుసరించి శరీర నిర్వహణార్థము, ఇతర వ్యవహారములను చేయవలెను. (గీత 8–7)

9. ఈశ్వరుడు విశ్వవ్యాపకుడు అయినందున సమస్త సేవ ఈశ్వరసేవయే యగుతుంది. కావున పరమ సిద్ధిని పొందుటకై మానవుడు సకల జీవులను ఈశ్వర స్వరూపులుగా భావించి, తన న్యాయబద్ధమగు కర్తవ్యకర్మ ద్వారా సుఖము నొనగూర్చుటకు విశేష కృషి సలుపవలెను. (గీత 18–46)

10. తమ ఇంటిముంగిట నిలిచిన యాచకునకు, ఇచ్చుటకు శక్తి లేకపోయినా, ఏదో ఒక కారణము వలన ఇచ్చుటకు ఇష్టము లేకపోయినా సరే! కాని అతనితో వినయముగా, మర్యాదగా, ప్రేమతో వ్యవహరింపవలెను.

11. సకల జీవులు పరమాత్మ అంశలగుటచే పరమాత్మ స్వరూపములే యగును. కనుక నిందా, ద్వేషము, అసహ్యము హింసను విడనాడి సర్వులతో నిస్స్వార్థముగా విశుద్ధ ప్రేమ భావమును పెంచుటకు ప్రయత్నింపవలెను.

12. ధర్మమునందు, ఈశ్వరునియందు శ్రద్ధా, ప్రేమలు కలిగియున్న, స్వార్థత్యాగులు, సదాచార సంపన్నులగు సత్పురుషుల సాంగత్యము చేసి, వారి ఆదేశములను, అనుకూలమునుబట్టి ఆచరించుచు సత్సాంగత్య విశేషలాభమును ఆర్జించవలెను.

13. భక్తి, జ్ఞాన, వైరాగ్య, ధర్మములను పెంపొందించుటకై, శ్రుతి, స్మృతి ఇత్యాది శాస్త్ర గ్రంథములను చదివి, చదివించి, శ్రవణ, మననముల ద్వారా వాని తత్త్వము నెరిగి తమను తాము ఉద్ధరించుకొనవలెను.

★ ★ ★

# మరువకండి! మననము చేయండి!!

నామజపమును గూర్చి -

1. భగవన్నామమును లేదా మంత్రమును జపించునపుడు, దాని అర్థమును కూడా తెలిసి చేయండి.

2. జపము లేదా భజన ద్వారా ఇహ, పరములగు ఎలాంటి కోరికను కోరకూడదు.

3. జప, స్మరణ, భజన లందు మాటి మాటికి శరీరము పులకించిపోవాలి. మనసులో ఆనందము అతిశయించాలి. ఆనందము కలుగనిచో, ఆనందమును గూర్చిన సంకల్పముగాని, భావనగాని చేయాలి.

4. యథాసాధ్యముగా స్మరణ, భజన నిరంతరము చేయాలి.

5. భజన, స్మరణలందు శ్రద్ధను కలిగియుండుట; సత్కార బుద్ధితో చేయుట.

ధ్యానమును గూర్చి -

1. ఏకాంత స్థలములో ఒంటరిగా ధ్యానము చేయునపుడు మనస్సు తైలధారవలె ధ్యేయమునందే ప్రసన్నంగా, అత్యధిక సమయం వరకు సహజంగా తల్లీనమైపోవాలి; అప్పుడే ధ్యానము చక్కగా జరుగగలదు. ఇట్టి స్థితి లభించుటకు అభ్యాసము అవసరము. అభ్యాసమునకు దిగువ సాధనముల ద్వారా సహకారము లభింపగలదు.

   (క) శ్వాసతో జపించుట,
   (ఖ) అర్థ సహితముగ జపించుట,
   (గ) భగవంతుని ప్రేమ, జ్ఞాన, భక్తి, వైరాగ్యములను గూర్చి చదువుట, వినుట.

2. ధ్యాన సమయములో ఎలాంటి సాంసారిక విషయములవైపు మనస్సును వెళ్ళనీయవద్దు. ఆ సమయంలో కేవలము ధ్యేయమునందే లక్ష్యమునుంచవలెను. ఎంత గొప్పదైనా సరే, ఇతర విషయములను మనస్సునుండి తిరస్కరించడమే లాభదాయకము.

3. సర్వవ్యాపి సచ్చిదానంద ఘనమునందు స్థితుడై జ్ఞాననేత్రముల ద్వారా, ఈ సర్వస్వము నా సంకల్పముపైనే ఆధారపడి నిలచియున్నదని గాంచవలయును. సంకల్ప మాత్రం చేతనే సర్వమూ ఉత్పన్నమైనది; సంకల్ప అభావము వల్లనే అంతా అభావమగుతుందని గ్రహించి సంకల్పమును కూడా త్యజించివేయాలి. సంకల్పము త్యాగం చేసిన మీదట మిగిలి యుండునదే అమృతము. అదియే సత్యము.

అదే ఆనందఘనము. ఈ విధంగా అచింత్యమగు ధ్యానమును తీవ్రముగా ఏకాంతమునందు అభ్యాసము చేయవలెను.

సాధకులకు ముఖ్య సూచనలు -

1. డబ్బు సంపాదనతో ప్రాపంచికమైన పనులు చేయుట వలన మనస్సు ప్రపంచంలో మునిగిపోతుంది. అందువలన, ప్రాపంచికమైన పనులను కడుజాగ్రత్తగా భగవత్ ప్రాప్తి కొరకే చేయవలెను.

2. సాంసారిక పదార్థములను, విషయ లంపటుల సాంగత్యమును సాధ్యమైనంతవరకు తగ్గించవలెను. సాంసారిక విషయములను గూర్చి చర్చను కూడా తగ్గించాలి.

3. ఇతరుల దోషము (తప్పు)లను చూడకూడదు. సహజంగా గోచరించిన యెడల అడగకుండా తెలుపకూడదు.

4. అందరితో నిష్కామంగా, సమభావంతో ప్రేమను కలిగియుండుటకు కృషి చేయవలెను.

5. నిరంతర నామజప అభ్యాసమును ఎప్పుడూ విడువకూడదు. జపమునందు బాధకమగు కార్యమును వదలివేయుట మంచిది. మిక్కిలి ప్రేమ, హర్షాతిరేకముతో నిత్య నిరంతరము భజన, స్మరణ జరుగుచుండినపుడు భగవద్దర్శనము యొక్క ఆవశ్యకత ఉండబోదు. శరీర స్మృతి కూడా లేనంతగొప్పగా నామస్మరణ యందు ప్రేమ పెరిగి పోవాలి. స్వయంగా భగవానుడే విచ్చేసి జాగృత పరచినాకూడా మహాత్ముడు సుతీక్ష్ణుని వలె ప్రేమ సమాధి చెడకుండా ఉండాలి.

6. ఈ సాధన లన్నియును త్వరగా సిద్ధించుటకై ఇంద్రియములను సంయమము చేసి తత్పరతతో అభ్యసింపవలెను. ఇందులకు దేనినీ లెక్కింపకూడదు. శరీరమును సైతము లెక్కింపరాదు.

7. శరీరమునందు అహంకారమేర్పడుట వల్లనే దాని నిర్వహణ గూర్చి చింతింపవలసి వచ్చును. కావున శరీరరూపి జైలునందు తెలిసి, తెలిసి ప్రవేశింపకుండా నుండవలెను.

## గీతాప్రెస్ - తెలుగు పారాయణ గ్రంథములు

| కోడ్ నెం. | తెలుగు పుస్తకము పేరు |
|---|---|
| 772 | శ్రీమద్భగవద్గీత పదచ్ఛేద అన్వయటీకా |
| 771 | శ్రీమద్భగవద్గీత (తాత్పర్యసహితము) |
| 662 | శ్రీమద్భగవద్గీత మూలము |
| 663 | శ్రీమద్భగవద్గీత వచనము |
| 670 | శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రము |
| 845 | అధ్యాత్మరామాయణము (తాత్పర్య సహితము) |
| 675 | సంక్షిప్త రామాయణము |
| 912 | శ్రీరామరక్షాస్తోత్రము సటీకా |
| 753 | రామచరిత మానసము సుందరకాండము |
| 676 | శ్రీహనుమత్ స్తోత్రావళి |
| 732 | నిత్యస్తుతి (ఆదిత్యహృదయ స్తోత్రసహితము) |
| 674 | శ్రీగోవిందదామోదర స్తోత్రము |
| 677 | గజేంద్రమోక్షం |
| 846 | ఈశావాస్యోపనిషత్తు (సటీకా) |
| 801 | శ్రీలలితాసహస్రనామస్తోత్రమ్ |
| 909 | దుర్గాసప్తశతి (మూలం) |
| 904 | నారదభక్తిసూత్రాలు (వ్యాఖ్యాసహితం) |
| 908 | నారాయణీయం (మూలం) |
| 910 | వివేకచూడామణి (సటీకా) |
| 914 | స్తోత్ర రత్నావళి |

## గీతాప్రెస్ - తెలుగు కథల పుస్తకములు

| | |
|---|---|
| 768 | రామాయణంలోని కొన్ని ఆదర్శపాత్రలు |
| 766 | మహాభారతంలోని కొన్ని ఆదర్శపాత్రలు |
| 665 | ఆదర్శనారి సుశీల |
| 689 | భగవానుని అయిదు నివాస స్థానాలు |
| 664 | సతీసావిత్రి |

760 పరమోత్తమ శిక్షణ
915 నీతికథామంజరి
916 నలదమయంతుల కథ
691 భీష్మపితామహుడు
767 భక్తరాజు హనుమంతుడు
686 భక్తఉద్ధవ
688 భక్తధ్రువ
917 భక్తచంద్రిక
918 భక్తసప్తరత్నాలు
685 బాలభక్తులు
682 భక్తపంచరత్నాలు
687 ఆదర్శభక్తులు
641 శ్రీకృష్ణభగవానుడు
692 మధురగాథలు
919 మంచికథలు

## గీతాప్రెస్ - తెలుగు ఉపదేశప్రద పుస్తకములు

666 అమూల్యసమయము దాని సదుపయోగము
690 బాలశిక్ష
673 భగవానుని అవ్యాజసుహృద్భావము
678 సత్సంగములోని సాధువచనాలు
907 ప్రేమభక్తి ప్రకాశిక
913 భగవత్ ప్రాప్తికై సర్వోత్కృష్ట సాధనము
నామస్మరణము
920 పరమార్థ పత్రావళి
672 సత్యాశ్రయంవల్ల ముక్తి
921 నవవిధభక్తులు
922 సర్వోత్తమ సాధనము
923 భగవంతుడు దయాళువు న్యాయమూర్తి
733 గృహస్థాశ్రమంలో ఎలా ఉండాలి

| | |
|---|---|
| 761 | ఒకటి సాధిస్తే అన్నీ సాధించినట్లే |
| 759 | శరణాగతి (ముకుందమాలా సహితము) |
| 758 | వర్తమాన దేశపరిస్థితులు వాటి పరిణామాలు |
| 734 | మూర్తిపూజ ఆహారశుద్ధి |
| 731 | మహాపాపం నుంచి కాపాడుకో |
| 671 | నామజప మహిమ |
| 911 | మాతృదేవోభవ |
| 752 | గర్భపాతం ఉచితమా? అనుచితమా? |
| 906 | భగవంతుడే ఆత్మీయుడు |
| 905 | ఆదర్శదాంపత్య జీవనము |

## గీతాప్రెస్ - తెలుగులో పంచరంగుల చిత్రావళి

| | |
|---|---|
| 887 | జై హనుమాన్ |

శ్రీ హరిః

# నల దమయంతుల కథ

కర్కోటకస్య నాగస్య దమయన్త్యా నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్॥

అర్జునుడు అస్త్రప్రాప్తికై ఇంద్రలోకానికి వెళ్ళినప్పుడు పాండవులు కామ్యకవనంలో నివసిస్తూండేవారు. రాజ్యము పోయినందుకు, అర్జునుడు చెంతలేనందుకు వారు చాలా దుఃఖించుచుండిరి.

ఒకనాడు పాండవులూ – ద్రౌపదీ రాజ్యం పోయిన విషయమును గురించి ముచ్చటించుకొను చుండిరి. ధర్మనందనుడైన యుధిష్ఠిరుడు భీమసేనునకు విషయాలను తెలుపు చుండగా మహర్షి బృహదశ్వుడు తమ ఆశ్రమానికి విచ్చేయడం చూచాడు. ఆయన ఆగమనాన్ని గాంచి ధర్మరాజు ఎదురేగి స్వాగతించి ఆసనముపై కూర్చుండ చేసెను. శాస్త్ర విధులను అనుసరించి పూజించెను. అనంతరము బృహదశ్వుడు విశ్రాంతి తీసికొనుచుండగా ధర్మరాజు ఆ మహర్షికి తన కథ చెప్పకొనసాగెను.

"మహాత్మా! కౌరవులు కపట బుద్ధితో నన్ను పిలిచి మోసపూరితంగా నాతో ద్యూత మాడారు. వారి పాచికలు పారాయి. పాపమెరుగని నన్ను ఓడించి నా సర్వస్వాన్ని హరించారు. ఇంతేకాదు, నా ప్రాణప్రియమైన ద్రౌపదిని ఈడ్చి నిండు సభలో అవమానించారు. చివరకు మమ్మల్ని అడవుల పాలు చేశారు. ఓ మహర్షీ, మీరే చెప్పండి. ఈ భూమిమీద నా వంటి భాగ్యహీనుడైన రాజు ఇంకెవరున్నారు? అయ్యా! నావంటి దుఃఖితుని ఎక్కడైనా మీరు చూచారా? లేక విన్నారా?" అని ధర్మరాజు తన హృదయగత బాధను వివరించాడు.

మహర్షి బృహదశ్వుడు చెప్పడం ప్రారంభించాడు "ధర్మరాజా! నావంటి దుఃఖితుడు మరొకడున్నాడా? అని నీవడగడం ఏమీ బాగాలేదు.